# కచ దేవయాని

నాటకము.

కచ దేవయాని

గ్రంథకర్త

ముత్తరాజు సుబ్బారావు, యం. ఏ.

*

ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు : సరస్వతీ బుక్ డిపో

బెజవాడ.

*

1938



[వెల 0–12–0

ప్రథమ ముద్రణ 1000 ప్రతులు

## హెచ్చరిక



Checked 1969

ముద్రణ: ఉషా ప్రెస్, తెలప్రోలు.

# కథాపాత్రములు



## పురుషులు.

ఇంద్రుఁడు స్వర్గాధిపతి. సురేశ్వరుఁడు I 1, 2. III 7.

అగ్ని: దిక్పాలుఁడు. I 1, 2. III 7.

వాయువు: ... ... ...

వరుణుఁడు: ... ... ...

బృహస్పతి: దేవగురువు. I 2. III 7.

కచుఁడు: బృహస్పతి జ్యేష్ఠపుత్రుడు. I 2, 3, 4, 5,. II 3, 5, 6 III 3, 5, 6, 7,.

నారదుఁడు: దేవముని. II 4 III 1.

వృషపర్వుఁడు: అసురేశ్వరుఁడు. I 1. II 1, 2, 4, 7,. III 1, 4

శుక్రాచార్యుఁడు: అసురగురువు. I 5. II 2, 3, 6, III 4, 5,.

దంభుఁడు: అసురుడు I 1. II 1, 5. III 3.

కుంభుడు: ... ... ... ...

నికుంభుడు: ... I 1. II 1, 2, 5, 7. III 3.

భాండాయనుడు: శుక్రశిష్యుడు I 5. II 2, 7.

## స్త్రీలు

శర్మిష్ఠ: వృషపర్వుని కూతురు. I 4, 5. II 1, 7. III 1, 2.

దేవయాని: శుక్రాచార్యుని కూతురు. I 4, 5, II 3, 6. III 2.5,6

రంభ: దేవవేశ్య I 2.

నిర్మల: దేవయానిచెలికత్తె. I 4, 5. II 3, 6. III 2. 5, 6.



# కథాసంగ్రహము



## ప్రథమాంకము

### రంగము 1

ఇంద్రాదులు వృషపర్వునిగెల్చి యసురోజ్జీవనంబునకు గారణ మరయ బ్రయత్నించి భగ్న మనోరథులగుట.

### రంగము 2

ఇంద్రుడు బృహస్పతివలన మృతసంజీవనీప్రభావ మెరింగి కచుని దాని నభ్యసించిరమ్మని పంపుట.

### రంగము 3

కచుడు శుక్రాచార్యునికడ మృతసంజీవనీవిద్య నభ్యసింప నేగుట.

### రంగము 4

నిర్మల శర్మిష్ఠ దేవయానులుద్యానవనమున విహారించుచు కచుని గని వెంబడించుట.

### రంగము 5

శుక్రాచార్యుడు దేవయాని ప్రేరణచే కచుని శిష్యునిగా నంగీకరించుట.

## ద్వితీయాంకము

### రంగము 1

విజయముగాంచి వచ్చు వృషపర్వునకు శర్మిష్ఠ కచుని వృత్తాం

తము దెల్పి యాతని బాలదోల బురికొల్పుట.

రంగము 2

వృషపర్వుడు శుక్రునితో గచునిపై గొండెములు జెప్పి వానిపై గోపము దెప్పించుట.

రంగము 3

ఉద్యానవనమున నున్న కచ దేవయానుల దండకు శుక్రుడేగి పుత్రికచే ననుసయింపబడుట.

రంగము 4

శుక్రుడు వృషపర్వునకు కచుని పంపివేయనని చెప్పుట. వృషపర్వుడు నారదుని ప్రేరణచే కచుని చంపింప నిశ్చయించుకొనుట.

రంగము 5

ఆవులగాయుచున్న కచుని రాక్షసులుచంపి తాలవృక్షమునకు గట్టిపోవుట.

రంగము 6

కచుడు రాకున్న గుండు దేవయానికి మృతసంజీవనిచే వాని బ్రతికించి శుక్రుడు తిరుగ రప్పించుట.

# తృతీయాంకము

రంగము 1

వృషపర్వునకు నారదుడు కచుని మారణోపాయం బెరింగించుట.

రంగము 2

శర్మిష్ఠ దేవయానికడకేగి, పుష్పములకై కచుని వనమునకు బంప బురికొల్పుట.

రంగము 3

పుష్పములకై తిరుగాడు కచుని రాక్షసులుచంపి భస్మమొన ర్చుట.

రంగము 4

రాక్షసులు శుక్రునకు సురలో, కచుని కళేబర భస్మమును గలిపి, త్రావనిచ్చుట.

రంగము 5

దేవయాని కచుని రాకకై నిరీక్షించి కుంచుచుండ శుక్రుఁడు మృతసంజీవని విద్యచే కచుని బ్రతికించి, మృతసంజీవనీ విద్యనేర్పుట. కచుడు సెలవు గాంచుట.

రంగము 6

దేవయాని కచునితో మోహముదెల్పి యతడంగీకరింపకపో వుటచే, శపియించి, శాప్తయగుట. కచుఁడు దేవలోకమేగుట.

రంగము 7

అమరానందము.

* ఈ ఫ్లవర్ గుర్తుపెట్టినచోట సందర్భాను సారముగ కీర్తనల ను పాడుకోవలయును.



*

# నాంది



లీన భక్త్యాఢ్యుల కాదితేయులకు యు
    ద్ధక్షోణి దైతేయ దు
ర్జనసంఘంబులఁ జుట్టుముట్టి గెలువన్
    సాహాయ్యముం జేసి, స
జ్జన సంత్రాణ పరాయణుం డనగఁ బ్రా
    శస్త్యంబునుం గాంచు, నా
వనజాక్షుం డొడఁగూర్చు మీకు విజయై
    శ్వర్యాయురారోగ్యముల్ !

*

పావన ముత్తరాజు కుల
    వార్నిధి సోముఁడు సుబ్బరావు, భూ
దేవకులాగ్రగణ్యు కచు
    దివ్యచరిత్రము నాటకంబుగాఁ
గోవిదులార! వ్రాసె, నది
    కూర్చి ప్రదర్శనముం బొనర్చుచో
నేవయినన్ దొసంగు లుద
    యించిన మమ్ముల నెమ్మిఁ బ్రోవుడీ!

*

*

# అమరానందము

అను

# కచ - దేవయాని

---

## ప్రథమాంకము

= ప్రథమ రంగము =

స్థలకము: సురలోక ప్రాంతభూమి. దేవదానవ యుద్ధము.

( రిపు కృపాణాఘాతంబున నీల్గిన సురుల మొండెములచే మండితం బైన భండన భూమిని రక్త సిక్త ఖడ్గంబుల నెత్తి యింద్రాగ్నివాయు వరుణులు విజయగీతము పాడుచుందురు. )

* (గీతము)

వరుణుడు: దేవా! నేడు యుద్ధము సాంతమయినదిగదా?

ఇంద్రుడు: వరుణా! అట్లే యున్నది. ఈ నిశాచరులు పరాజితులై యెత్తిన కాలు దించక యెట్లు పరువిడుచున్నారో చూడుము.

అగ్ని: దేవా! ఇంక మనము మన లోకమున కేగుదమా?

ఇంద్రు: అంతకంటె మనకుఁ గరణీయ మేమున్నది? పారిపోవుచున్న ప్రతిపక్షులఁ బైకొని, పొరిమార్చుట పౌరుషవంతులకుఁ బాడి కాదు. అయిన వీరల మఱల నుపాలంభన మొనర్చినఁ గ్రమ్మఱిల్లి యుద్ధమాడ నుపక్రమింతురేమో?

చం॥ నిలువుడు నిల్వుడోరి జననిందిత దుష్టనిశాటులార! సం
కులసమరాంగణంబున నకుంఠితవిక్రములై విరోధులం
గలఁచి జయంబు గైకొనక కాలికి బుద్ధిని జెప్పనేల? మీ
రలజడి మాని విశ్రుత బలాఢ్యులరేని రణం బొనర్పుఁడీ!

(తెరలో గలకలము నాలించి) దిక్పాలులారా! ఆ కలకలము వింటిరే? మన పౌరుషపుమాటలకెవ్వడో దైత్యపాంసనుండు కనలి మన కోపాగ్ని కింధనము గావచ్చుచుండెను.

వాయువు: దేవా! మీమాట వాస్తవము. అదిగో! అవంక జూడుడు. ఎవడో గాత్రించరుడు కతిపయ సైన్యంబుతో మనవంక కేతెంచుచున్నాడు. (అందరు చూతురు)

అగ్ని: దేవా! నేనేమయిన పొరపడుచున్నానా? మీరతడెవడో పరికింపుడు.

ఇంద్రు: (పరికించి) పావకా! (ఆశ్చర్యము నభినయించుచు) ఏమిది? నా వేయి కన్నుల దెరచి చూచినను నాతడు వృషపర్వుడుగా గానవచ్చుచున్నాడు.

వాయు: దేవా! నాకు నట్లే తోచుచున్నది.

అగ్ని: సురేంద్రా! ఇదేమి వింత? నిన్న నీ వృషపర్వుండు తమ దంభోళి ప్రహారణంబున జర్జరితాంగుడై మడియలేదా? అట్లు నిన్న మరణించినవా డెట్లు నేడు పునర్జీవుడయ్యె?

ఇంద్రు: పావకా! నాకు నిది కడు చిత్రముగ నున్నది. ఈ మూర్ఖుల కడ నే మంత్రౌషధము లున్నవో దానిని తరువాత విచారింతము. అదిగో! వాడు క్రోధ ఘూర్ణిత నేత్రుండై మనపై కెత్తివచ్చుచున్నాడు. మీరు మీ సేనలం దగు జాగరూకతతో నడిపించి విజయ మందుడు.

(వృషపర్వుండు భీకరాకారుండై కుంభ నికుంభ శౌండులతో ఖడ్గంబుల నొరలనుండి తీసి యుద్ధరంగమున దుముకుచు)

మ॥ వృషపర్వుండు కృతాంతు లోకమునకున్ విచ్చేసెనం చోరి వి
ద్విషులారా! ప్రమదంబు నొందితిరి గాదే నిన్న? నేడీ సుర
ద్విష సన్నాహముతోడ వచ్చితిని దోర్వీర్యంబు బెంపారం బా
రుడు మేపార బలాఢ్యులేని నుము పోరుం జేసి నిర్జింపుడీ!

ఇంతకుమున్ను నామిత్రుని సైన్యంబును గడతేర్చితిమని సంతసింప కుఁడు. ఇల్లలికినంత బండువగునా? మా ప్రభావమును మీరింకను బాగుగ గుర్తింపరైరి. కానిండు. ముందున్నది ముసుళ్ళపండుగ.

ఇంద్రు: ఓరీ! వాచాటా! ఈ గ్రుడ్డి బెదిరింపులకు సమర కర్కశ బాహువులును, సంతతసంగ్రామసుజ్జయులు నగు నిర్జరులా భయ పడువారు? ఇంక నీ వాచాలత్వము వదలి బాహు బలంబున్న యుద్ధమునకుఁ గడంగుము. నిన్నఁ జచ్చితివో లేదో కాని నేఁడు మాత్రము నీకు జావు తప్పదు.

* ( గీతము )

( ఇంద్రుఁడు వృషపర్వునితోఁ బోరుచుండ నగ్ని వరుణ వా యువులు కుంభ నికుంభ శౌండాసులతోఁ బోరి వారిం గూల్తురు. వృషపర్వుం డేకాకి యగుట గాంచి పరువెత్తును.)

ఇంద్రు: దిక్పాలులారా! మరల మనకు సుర పక్షపాతి యగు మధు సూదనుని కృపచే విజయంబు సేకూరె. ఇంక నేఁడు రణము చాలించి పురమున కేగుదము. అయిన నేఁడొక్క సంశయంబు దీరె. ఇంతకు మున్ను మనము దినదిన మెంతమంది రక్కసులఁ జక్కాడినను వారల సంఖ్య యిసుమంతయు దఱుగకుండుట నాకుఁ జిత్రముగ నుండె. నేఁడు వా రేమంత్ర ప్రభావముననో, ఓషధీ ప్రభావముననో చచ్చియు మఱల జీవించుచున్నారని తెల్ల మయ్యె. దీనికిఁ గారణంబు మన మెఱుంగకున్న మనకు విజయం బు దుర్లభంబు. కావున అగ్ని వాయువులారా! మీరిందు నిలిచి రాక్షసుల మర్మంబుల గనిపెట్టి రండు.

ఉ॥ దేవతలార! పోరునఁ బదింబది దైత్యులఁ ద్రుంచినన్ బున
ర్జీవితులౌచు సంగరధరిత్రిని మూఁగెదునార లౌర! సం
జీవని విద్య వారికి వశీకృతమయ్యెనో యేమొ? మీర లిం
దే వసియించి మర్మము గ్రహించి రయంబు పురంబు చేరుఁడీ!

అగ్ని: దేవా! మీ యాజ్ఞను శిరసావహించెదము.

ఇంద్రుడు: పవన పావకులారా! మీరింకు వేచియుండి యీ గత జీవులగు రాక్షసులెవ్వరయిన బ్రతికిన వాని బంధించి వాని యుజ్జీవన రహస్యంబు నేవిధమున నైన గ్రహించి నాకు నివేదింపుడు. అంత దానికిఁ దగిన ప్రతిక్రియ నొనర్చి మనము విజయంబును గరతలామలకంబు నొనరింతము. వరుణా! రమ్ము. పవన పావకులారా! అప్రమత్తులరై యుండుడు.

(ఇంద్రవరుణులు నిష్క్రమింప నగ్నియు వాయువును రాక్షస కళేబరంబుల గాచుచుండ నంతు నికుంభుడు నిద్రనుండి లేచినట్లు లేచి అగ్ని వాయువుల దిలకించి పరువెత్తును. అగ్ని వాయువులు వాని " నిల్వు నిల్వు " మనుచు వెంబడింతురు. వారట్లు పరుగు లెత్తుచుండ నితర హత రాక్షసులు లేచి పారిపోవుదురు. అగ్ని వాయువులు నికుంభుని బట్టుకొని రెక్కలు విరిచి కట్టి తెత్తురు.)

వాయు: పావకా! చూచితే. మనము వీనిని బంధించి తెచ్చులోపల నింకు నిహతులయిన రాక్షసులెల్లరు సజీవులై పారిపోయిరి.

అగ్ని: పవనా! ఇది కడు విచిత్రముగ నున్నది. దీనికిఁ గారణమును వీనిఁ బ్రశ్నించి కనుగొందము. (నికుంభునివంక తిరిగి) ఓరీధూర్తా! ఎవడవురా నీవు?

నికుంభుడు: నారూపము, గుణములు నేనెవడనైనది మీకుఁ జెప్పక యే చెప్పుచుండ లేదా?

అగ్ని: ధూర్తా! నీవు ప్రముక్కడి రక్కసుఁడవని మే మెఱుఁగుదుము. నీ పేరేమిరా?

నికుం: శత్రువుల చేఁజిక్కినవానికిఁ బేరెక్కడిది?

వాయు: ఓహో! నీవంత పౌరుషవంతుఁడవా?

నికుం: నా పౌరుషమును నా వైరు లెరుంగుదురు. ఈ బంధనముల

వదలించి నాకొక ఖడ్గమిచ్చిన మీరును ద్వరలో నెఱుంగఁగలరు.

అగ్ని: ఈ దర్పోక్తుల నటు కట్టిపెట్టి మేమడుగు ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిమ్ము. నీవు గడియ క్రిందట మాతోఁ బోరి యసువుల బాయలేదా?

నికుం: ఏమో! నాకేమి తెలియును. మృత్యువన నెట్టిదో మీరు మాత్ర మెఱుంగుదురా?

వాయు: ధూర్తా! అహంకారము మాని యుత్తర మిమ్ము. వృషపర్వుఁడు నిన్నుఁ జావలేదా?

నికుం: అయ్యది నాకేమి యెఱుక? సమర్థులరేని యా వీరుని బాధించి పృచ్ఛింపుఁడు.

అగ్ని: మాటకుమాట చెప్పక చచ్చిన దైత్యులే కారణంబునఁ బునర్జీవితు లగుచున్నారో తెలుపుము.

నికుం: మీకుఁ దెలియని కారణము చేత.

వాయు: ధూర్తా! దానిని జెప్పెదవా? లేదా? మీరు చచ్చి మరల బ్రతుకుటకుఁ గారణ మెద్ది?

నికుం: మీబోటి యజ్ఞు లెఱుంగని యసురమాయ.

అగ్ని: (స్వగ) ఆహా! శ్రుతి మించి రాగమునఁ బడుచున్నదే. (ప్ర) ఓరీ! బాలిశా! మాతోనటరా నీ వెకసక్కెము లాడెదవు? నీకేమి జీవింపంగ వాంఛ లేదా?

నికుం: ఓయీ! ఆదితేయుఁ! వీరునకు మృత్యువన్న భయమేల? పుట్టుట గిట్టుటకే కదా? మరియు మీబోంట్లు నన్ను జంపనైన జంపఁ గలరా?

అగ్ని: అదియు జూతము కాని మీ యుజ్జీవనసాధనంబు మంత్రమా?

వాయు: ( నికుంభుఁ డూరకుండ నొక పోటు పొడిచి ) చెప్పుము. తంత్రమా?

అగ్ని: (ఊరకుండ బొడిచి) సంజీవని యోషధియా?

వాయు: (ఊరకుండ) ధూర్తా! నీవింకను బలుకకున్న నీ నాలుక ప్రీల్చెదను.

నికుం: ఎంత శూర వరేణ్యుడవు? సుగ లాదను నింతటి పరాక్రమ వంతులేనా?

అగ్ని: మా మాటవదలి నీ రహస్యమును వెలిబుచ్చెదవా? లేదా?

నికుం: దేవతలారా! ఏల మీకీ కంఠశోష? మీరు నన్ను చీల్చినను, చెండినను, చంపినను, నేమి యొనర్చినను దైత్యుల రహస్యంబును దెల్పువాడనుగాను. మీకు వీరాచారములు విదితంబులేని మీ రడుగుటయు ధర్మంబుగాదు. నేను ముమ్మాటికి మీ యభీష్టము నెరవేర్చువాడనుగాను. తర్వాత మీయిష్టము.

అగ్ని: పవనా! ఈ విరిచిన విరుగని, తునిచిన తునగని దైత్యాంసను నేమి సేయుదము?

వాయు: పావకా! ఈ మొండిరక్కసుని వదలివేసి యమరేశుని సన్నిధి కేగుదము. రేపింతకంటె సాధువు నెవనినైన బట్టి మన యభీష్టము నెరవేర్చుకొందము.

నికుం: మీరు భ్రమపడకుడు. ఇసుకను దైలంబు దీయవచ్చును గాని మా వారినోట నీ రహస్యంబును వెలిబుచ్చలేరు.

అగ్ని: ధూర్తా! మాటాడక పొమ్ము. (బంధముల వదలి యొక నెట్టు నెట్టును.)

వాయు: పావకా! ఇంక రమ్ము. స్వర్గాభిముఖులమై పోవుదము.

( నిష్క్రమింతురు )

*

## = ద్వి తీ య ర ం గ ము =

స్థలకము: ఇంద్రలోకము. ఇంద్రుని సభామందిరము

(ఇంద్రుడు వివర్ణవదనుడై సింహాసనాసీనుండై యుండ వరుణుఁడు దండ నుండును. రంభ నాట్య మొనర్చుచు సుర విజయమును గాన మొనర్చుచుండును.)

* (గీతము)

ఇంద్రుడు: రంభా! నీ నృత్య గీతంబుల నుజ్జగింపుము. నేఁడు నా మనం బన్యాలోచనా నిమగ్నంబగుటంజేసి యివ్వివి నా కను దినంబునుం బోలె సంతస మీాఁజాలకున్నవి. ( రంభ యూరక ప్రక్క నిల్వ ) వరుణా! నా కెంత యోజించినను గర్తవ్యము తోఁపకున్నది.

ఉ॥ ఏమి యొనర్చువాఁడ నిక నెయ్యది కర్జము? దేవ దైత్య సం
గ్రామమునందు చచ్చిన సురల్ నరకంబున కేగుచుండ బూ
ర్వామరులెల్లరు స్మరలఁ బ్రాణములం గని విక్రమించువా
రీమెయి నెంతకాలము జయింపఁ గలారము వారి మిత్రమా!

వరుణుఁడు: సురేంద్రా! దైవము మనపట్ల నుండ మనము విజయ మొందకుందుమా?

ఇంద్రు: వరుణా! మనవారలు దినదినము యుద్ధంబున మ్రందుచుండ దానిఁ జూచి నేనెట్లోర్తును? దైత్యులు చచ్చియు గ్రమ్మర బ్రతుకుటంజేసి వారు వెనుదీయక విక్రమించుచున్నారు. ఇందలి రహస్యము మనకుఁ దెలిసిన గురువర్య నడిగి యుచిత ప్రతిక్రియ యొనర్పవచ్చును.

వరు: దేవా! వాయ్వగ్నులందులకై నియోగింపఁ బడిరిగదా! వారి రాకకై వేచి యుందము.

ఇంద్రు: అదిగో! వారును వచ్చుచున్నట్లున్నది. (అగ్ని వాయువులు ప్రవేశించి నమస్కరింప) పవనపావకులారా! ఆసీనులగుడు. మీ ముఖము లేమి వసివాడియున్నవి. నే బంచినకార్యమేమయ్యెను?

అగ్ని: దేవేంద్రా! ఏమి చెప్పుదును?

మ॥ అమరాధీశ్వర! నీకు పంపున సమీరాకారపన్న దైతేయుబ్రాం
డమునుంగాంచుచునుండ నందొకఁడు సేదంచీటి మేల్పొన్న చం
దమునన్ లేచి గమించుచుండ నతని న్బంధించి దైతేయు మ
ర్మమునుంగన్గొన నేమిసేసినను వ్యర్థంబయ్యె మాయత్నముల్.

ఇంద్రు: అక్కటా! మీరిరువురు వానిగుట్టు గనుగొనలేకపోయిరా?

వాయు: దేవా! వానిని సర్వవిధంబుల బతిమాలితిమి. దండించితిమి. మా బతిమాలిక లతిమాత్రములయ్యె. మా తర్జనభర్జనంబులన్నియు బెడచెవింబెట్టఁబడియె. మా దండనలు వృథాయయ్యె. మరణమన్న భయము లేనివాని, నిష్టము లేనిమాట, నుడివింపసాధ్యమా? ఇందుచే వాని వదలి తేపింకేదైనను బ్రుచ్ఛించి కనుగొందమని తిరిగి వచ్చితిమి. మా యప్రగల్భతకు మమ్ము మన్నింపవలయును.

ఇంద్రు: పవనపావకులారా? యావచ్ఛక్తిని వినియోగించి మా కార్యమును నెఱవేర్పబూనుకుంటిరింతియేచాలును. ఇఁకకర్తవ్యమేమి

అగ్ని: తేపఁటిదాఁక వేఁచియుండి మరలఁబ్రయత్నించుటయే!

ఇంద్రు: తేపుమాత్రము దైత్యులు రహస్యమును వెలిబుత్తురని నిర్ధారణ సేయుటెట్లు?

వరు: తేపటిదాఁక నీ సందియంబు సహించుటెట్లు? దేవా! మన యాచార్యుండు దివ్యదృష్టి విభూషితుండు. వారినడిగిన సర్వము కరతలామలక మగు.

ఇంద్రు: వరుణా! బాగుగా బలికితివి. ఆచార్యవర్యుఁ బిలిపింతము.

( బృహస్పతి ప్రవేశింప దిక్పాలురందరు నమస్కరింతురు. )

బృహ: దిక్పాలురారా! విజయీభవ. మీ వదనంబుల విన్నదనము పుంజీభూతమై యున్నదేల? నేడుగూడా మీకు విజయము చేకూరెనుగదా?

ఇంద్రు: గురువర్యా! అవును. కాని మాకెంతకాలమిట్లు విజయము చేకూరునోయని సంశయముగ నున్నది.

బృహ: సురేంద్రా! యేటికీ సంశయము?

ఇంద్రు: గురువర్యా! ఏమి నుడువుదును. దేవాసురరణంబున నీల్గిన సురలు ప్రేతరూపము నొందుచుండ, నసురులు చచ్చియు నెట్లో సజీవులై మరల మరలఁ బోరాడుచున్నారు. ఇందుచే మన భటుల సంఖ్య దినదినము తగ్గుచుండ వారి బలంబులు చెక్కుచెదరక విజృంభించుచున్నవి.

బృహ: ఏమి యాశ్చర్యవృత్తాంతము! ఇందులకుఁ గారణముఁ గను గొంటిరా?

ఇంద్రు: కనుగొన ప్రయత్నించి భగ్నమనోరథుల మైతిమి. ఇఁక మీరే మాకద్దానిఁ దెలుపవలయు.

సుగంధి॥ తమరు దివ్య దృష్టిఁగాంచఁదగని మర్మమీ త్రిలో
కముల నొండు లేదు గానఁ గరుణతోడ మీమదిన్,
శ్రమ మటంచు నెంచకుండ శత్రుమర్మ మెట్టిదో
విమల చరిత! మాకుఁదెల్పి ప్రీతి గూర్పుఁ డీమెడన్.

బృహ: అందులకు సందియ మేల? (దివ్య దృష్టింజూచి) దేవేంద్రా! తెలిసినది.

కం॥ దేవాసుర రణమున గత
జీవితులగు నసుర వరుల జెచ్చెర మృత సం
జీవనియను విద్యచె బున।
ర్జీవులుగా నసురగురువు సేయు సురేశా.

ఇంద్రు: గురువర్యా! అఖిల కళాసాగరులగు మీకా విద్య రాదా?

బృహ: దేవేంద్రా! నాకీవిద్య రాదని చెప్పుటకెంతయు సిగ్గగుచున్నది.

ఇంద్ర: అక్కటా! ఇది మాదురదృష్టము. ఇంక మాకా విద్య దెల్పి యుపకారమొనర్చువారెవరు? నారదుండైన లేడుగదా?

అగ్ని: దేవా! మాకుపకారమొనర్చుటయందారితేరిన రంభాదు లుండ లేదా!

ఇంద్రు: సేవకా! రంభాదులం బిలువుము.

(రంభ ప్రవేశించి) * (గీతము)

ఇంద్ర: శుక్రాచార్యునుండి నీవు మృతసంజీవనీ విద్య నేవిధముగానైన సేకరించి మాకానంద మొనగూర్ప యత్నించెదవా? (రంభ నేల బొటన వ్రేలు రాచుచు నూరకుండును) ఏ మూరకున్నావు? కటాక్షమాత్రంబున నెట్టివానినైన బందీకృతుం జేసి నీయభీష్టంబు నెరవేర్చుకొనుదానికీ విషయ మొక గొప్పయా? నీకు వలసిన మన్మథుని దోడిచ్చెద. అసురలోక మేగి శుక్రు మోహింపం జేసి రహస్యము గనుగొని రమ్ము.

రంభ: దేవా! ఇయ్యది నాకు మించిన కార్యము. ఆ శుక్రాచార్యుండు ముసలి. పుత్రవంతుండు. భార్యా సమేతుండు. జితారిషడ్వర్గుండు. అసురాచార్యుండు. అతండేమి? నా వలలోం జిక్కి నాకా దివ్యమంత్ర ముపదేశించుటేమి? ఇది కలలో వార్త.

* (గీతము)

బృహ: సురేశా! రంభ పల్కినది వాస్తవము. శుక్రునుండి యావిద్య గ్రహింప శిష్యులకే నలవియగుగాని యొరులకుం గాదు; ఆ శుశ్రూష యొనర్చి శుక్రు సంతసింపంజేసి, ఆ విద్య గ్రహింప నా యగ్ర సుతుండు కచుండొక్కండే సమర్థుండు.

మ॥ అమలాచారపరాయణుం డఖిలవిద్యాసాగరుం డుత్తమో
త్తమసామర్థ్యుడు నాసుతుండు కచుండా దైత్యాశ్రయమున్ గొల్చివె

శమ సంజీవని దివ్యవిద్య ననలీలన్ నేర్చి నిక్కంబుగా
నమరానంద మొనర్చు వాఁడతని నాహ్వానింపు మాఖండలా!
నా పుత్రు నే నగ్గింపఁ గూడదు కాని వాని సామర్థ్య మీ రెఱుంగి
నదియా?

ఇంద్రు: ఆచార్యవర్యా! మీ యగ్రసుతుండీ కార్య మొనర్చుటకు నిస్సంశయముగ సమర్థుఁడే? వానిని బిలిపించెద. సేవకా! కచుని బిలుచుకొనిరమ్ము. గురువర్యా! కచుండు మృతసంజీవని నేర్చి వచ్చిన యాతనికి హవిర్భాగ మొసఁగింపించెద.

బృహ: ఇంద్రా! అతఁడు సురశ్రేయోభిలాషి కాన, నీ వడిగినంత నంపులకీయకొనును.

ఇంద్రు: అదుగో! కచుఁడు వచ్చుచున్నాఁడు.

( కచుఁడు ప్రవేశింప ఇంద్రాదులు నమస్కరింప నాశీర్వదించి, తండ్రికి నమస్కరించి దీవింపఁబడినంత )

కచు: సురనాథా! నన్నేల పిలిపించితిరి?

ఇంద్రు: గురుపుత్రా! ఒక కార్యము గలిగె. దానిని నీ వొక్కరుండవే సాధింపసమర్థుండవు గాన నిన్నాహ్వానించితి.

కచు: సురేశా! నాబోటి కించిజ్జ్ఞుఁడు చేయగలిగిన కార్యమెద్ది?

ఇంద్రు: మ॥ మృతసంజీవని చేత నీ సమరభూమిం బడ్డ దైత్యాళి, జీ
వితులం గ్రమ్మరఁ జేయు శుక్రుఁడనుచు న్విన్నాఁడ నా విద్య నా
సుతుఁ డొక్కం డెకొనంగలాఁడతని శుశ్రూషించి యంచున్ బృహ
స్పతి వాక్రుచ్చెనికట్లొనర్చి మది కాపాడింపు మానందమున్.

బృహ: పుత్రా! అసురాచార్యుఁడగు శుక్రుఁడేమి సురాచార్య సుతుఁడనగు నాకు మృతసంజీవనీ విద్య నేర్పునేమియని సంకోచింపకుము.

కం॥ బాలుండవు నియమవ్రత శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ జేకొని, తద్వి
ద్యాలలనాబాసము కరుణాలయుఁడై చేయునమ్మహాముని నీకున్.

ఇంద్రుః నీవు మా యభీష్టంబు నెరవేర్చెదవేని నిన్ను భాగభర్తగా నొనర్తుము. సురహితైషుల నిన్నుబోలువాఁడు లేడు. కావున సంశయింపక మా పనుపూని శుక్రశిష్యుఁడవుగమ్ము. నారదుని నీకు సహాయు మొనర్పఁబంపెద. ఏమనియెదవు?

కచుః సురేంద్రా! అనుటకేమున్నది?

ఉ॥ కోరినవాఁడవింద్రుఁడవు; కోరినకోర్కె సురప్రహర్షదం
బారవితారకంబుగ మహద్యశఃసుబ్బును దీన నాకు! బృం
దారకనాథ! యిట్టియెడఁ దామసమేని యనిష్టమేని నా
కే రహిఁ గల్గునయ్య? సెలవిమ్ము గమించెద గార్యసిద్ధికై.

ఇంతవఱకు కూఱకుండుటకు గారణంబు నా శక్తి సామర్థ్యంబులఁ గూర్చిన శంకయే కాని వేరుగాదు. దానిని మా తండ్రిగారు తీర్చిరి. ఇఁకఁ గార్యంబు సత్వరంబు చక్కబెట్టెద.

శా॥ శుక్రాచార్యుని సన్నిధానమున శుశ్రూషల్ మనఃపూర్తి ని
ర్వక్రక్రియఁ జేసి యాతని కృపావాల్లభ్యమార్జించి రా
గాక్రాంతాత్మునిఁ జేసి మీ వలచు విద్యారాగము న్వేగ హ
స్తాక్రాంతంబొనరించి క్రమ్మఱ సుపర్వానందమున్గూర్చెదన్

అమరేంద్రా! ఇఁక నాకు సెలవిమ్ము! కార్యార్థినై శుక్రసన్నిధి కేగెద.

ఇంద్రుః గురుపుత్రా! అట్లే యేగి మృతసంజీవనీ విద్య నభ్యసించి యమరానందం బొనర్చి యాచంద్రార్క మమలయశో విభూషితుండవగుము. మఱియు నీవు తలంచినమాత్రె నీకు నా విమానమంపెదను.

కచుః తండ్రీ! నాయుద్యమంబు జయప్రదమగునట్లాశీర్వదింపుఁడు.

బృహః పుత్రా! ఒకటిరెండు మాటలు చెప్పవలసియున్నది. శుక్రుం డిప్పుడు వృషపర్వుని పట్టణోపాంతమున నొక యాశ్రమము

నంటున్నాఁడు. అతఁడు పుత్రికావిధేయుఁడు. పుత్రులున్నను, పుత్రికయగు దేవయానిని ప్రాణప్రదముగఁ జూచుచు నామె యీప్సితములకు మాఱుపల్కక సమకూర్చుచుండు. నీవా తన్వీలలామను శీలంబుచేతను, దాక్షిణ్యంబుచేతను, సదాచారముల చేతను, దమంబుచేతను, నిజసోదరింబోలె సంతుష్టాత్మఁగాఁ జేసిన నీకోర్కె తప్పక సఫలమగు. ఇఁక బోయిరమ్ము. దైవము నీకుఁదోడగుగాక.

మ॥ హరిపై నింద్రునిపై ధనాధిపతిపై నార్యామహాదేవిపై
సరసీజాసనుపై ధనంజయునిపై సర్వామరశ్రేణిపై
బరగంగొల్పిన మీ కృపారసము నీ పర్యాయము మీ బాలుపై
వరలంజేసి ముదంబుగూర్చుమిక దేవా భక్తచింతామణీ!

(యవనిక జారును)

*

= తృతీయరంగము =

స్థలకము: అసురలోకమార్గము.
( కచుడు విమానము దిగి నడచుచు )

కచు: ఆహా! అదిగో వృషపర్వుని పట్టణము. ఇంక నివసించియే కదా దేవకార్యమును సాధింపవలయు. అక్కటా! ఎంతటి కార్య భారమును తలపై దాల్చివచ్చితిని?

ఉ॥ దేవవిభుండు నన్బిలిచి దేవహితైషుల నిన్నుబోలు భూ
దేవుడు లేడు లేడని పదింబది స్తోత్రమొనర్పగా నహం

భావము బూని మీరడుగుచు వైఖరి శుక్రునియొద్ద జేరి, సం
జీవని దెత్తునంచును వచించితి నింకెటు సేయువాడనో!

ఇంక గడియలోపల శుక్రాచార్యుని సందర్శింపగలను. అతనితో నా నామధేయాదుల జెప్పి నే వచ్చిన కార్య ముగ్గడించిన నేమనునో?

మ॥ అతడే దేవగురూద్భవుండు, నిను విద్యాదానముద్ధింప వ
చ్చితివంచు న్వచియించినంతనె నను న్జేపట్టి రక్షించునో
మృతసంజీవని విద్యనేర్ప నసురా మిత్రాళి పంపూని వ
చ్చితివంచున్ దన దివ్యదృష్టిగని నన్జడ్పాటు గావించునో?

ఛీ! ఇది నా వెలతలంపు గాని నిక్కువముగా నా రక్షోగురుండు నా ప్రార్థన కియ్యకొనకుండునా? ఒకవేళ నట్లొనర్చిన నేమి కర్తవ్యమున్నది? ఒకవేళ నాతడు నా కోర్కె కియ్యకొన దలచినను రాక్షసు లాతని నంగీకరింప నిత్తురా? వారి మాట నతిక్రమించి నన్నాతడు ఛాత్రునిగా గైకొన్న నన్ను వారు హింసింపకుందురా? ఒకవేళ నెంత శుశ్రూష యొనర్చినను నాకీవిద్య నాతడుపదేశింపకున్న నెట్లు? అక్కటా! ఇట్లు గత జల సేతు బంధనము నాకు దగునా?

శా॥ కానీ; యిందది యైన దింక దివిషత్కార్యానుసంధాయినై
మానప్రాణములైన నేమయిన సమ్యగ్రీతి నర్పించి, నా
చే నైనంతయు జేసి చూడక యె కుంచింపంగ నేలా? భయా
ధీనస్వాంతత దేవకార్యమున వెన్దీయంగ సన్మాన్యమే?

ఇంక భార్గవాశ్రమాభిముఖుండనై పోయి నా తండ్రి తెల్పినట్లు దేవయానిని నిజసోదరింబోలె తన్పి తన్మూలమున గురువర్యు నను గ్రహంబునకుం బాత్రుడ నయ్యెద. వృషపర్వాదులు దేవాసుర

యుద్ధమునుండి రాక పూర్వమే యీ కార్యంబును జక్కగా నిర్వ
ర్తించుటకు నాకాదినారాయణుండు తోడ్పడుఁగాక!
* (గీతము)

( నిష్క్రమించును )

*

= తు రీ య ర ం గ ము =

స్థలకము: శుక్రాశ్రమోపాంతోద్యానవనము.
(దేవయాని, శర్మిష్ఠ, నిర్మల వనవిహార మొనర్చుచుఁ
బాడుచుందురు)
* (గీతము)

నిర్మ: నెచ్చెలీ! దేవయానీ! నేటికీ వన విహారంబుఁ జాలింపుఁడు. ఇంకను వనవిహార మొనర్చిన మిక్కిలి డస్సిపోవుదువు. అంత నాచార్యవర్యునిచే మాకు నిష్ఠురంబులౌ జీవాట్లువచ్చును.

శర్మి: నిర్మలా! ఇప్పుడే గదా మనము విహరింప నారంభించితిమి. ఇఁకఁగొంతకాలము విహరింతము. మా దేవయాని యరిగిపోవను లెమ్ము.

నిర్మ: శర్మిష్ఠా! గురువర్యు నైజ మెఱిఁగియు నీ విట్లాడ నే నేమనఁ గలను? దేవయానీ! రమ్ము. ఆ రసాల వృక్షముక్రింద విశ్రమించి మాటలాడుకొందము.

దేవ: నిర్మలా! అట్లేకానిమ్ము. నావలన నీవు నిష్ఠురపడనేల?
( ముగ్గురు నేగి రసాల వృక్షముక్రింద విశ్రమింతురు. )

దేవ: నెచ్చెలులారా! విటప విలాసంబును, కోకిలకీరషట్పదోల్లాసంబును, సర్వమనోవికాసంబును నగు నీ మధుమాసమున కధిష్ఠాన దేవతయగు మాధవుండు తన దాతృత్వంబుచే నెందఱ నెన్నివిధంబుల దనిపి సంతసింపఁజేయునో యోజించితిరా?

ఉ॥ పల్లవభోజనంబు, మధుపానము, శాద్వలచేల, మాత్మహృ
ద్వల్లభసంగమంబు, కలవాగ్గరిమంబు, నవీనజీవముం
గొల్లగఁ గూర్చు మాధవుఁడు కోకిలభృంగవసుంధరావియో
గోల్లలితాంగనా శుక ధరోద్భిదకోటికి దానకర్ణుడే.

నిర్మ: నెచ్చెలీ! ఈ మాధవుండు దానకర్ణుండగుటయేకాక తన యాశ్రితబృందమును గూడ భ్రమరకీట న్యాయంబున నట్లే యొనర్చుచున్నాఁడు. ఈ రసాలవృక్షంబును దిలకింపుము. చిగురులఁ గోయిలలను, ఫలంబులఁ గీరంబులను, మకరందమున మధుపంబులను, వాసనల మారుతంబులను దన్పుచున్నవి. ఇంతటి ప్రభావమును రసాలమందుండుటకు మాధవాశ్రయమే కారణము. ఇట్టి సచ్చరిత్రుఁడనియే కాఁబోలు వనలక్ష్మి వాసక సజ్జికయై యున్నది.

తే॥ గీ॥ ప్రాఁదళంబుల మలినాంబరంబువదలి
తలిరుటాకుల చెంగావి వలువగట్టి
సుమములంబెట్టి మాధవేశుని సమాగ
మంబు గోరు వనేందిర యంబుజాక్షి!

ప్రియకాంతాగమన దిదృక్షువుల కిట్టి యలంకరణము సహజమే కదా!

శర్మి: నిర్మలా! అవివాహితలును నవిమోహితలు నగు మాబోంట్లకీ గొడవ యేమి తెలియును? నీవలె మేము గడిదేర లేముగదా?

నిర్మ: శర్మిష్ఠా! తొందరపడకుము. కాలక్రమమున సన్నిహితులనుభవ వేద్యములు గాకపోవు.

దేవ: నిర్మలా! నిక్కువంబుగా నీ మధుప ఝుంకారాకర్ణనంబును, నీ మందమారుతస్పర్శనంబును, పుష్పితలతాశ్లిష్టవిటపదర్శనంబును నా మనంబునం దేదో నిర్వర్ణనీయమగు నవికారము గలుగ జేసి యసంతృప్తి కలుగ జేయుచున్నది.

నిర్మ: సంపూర్ణయౌవనవతులకీ మధుమాసము వికారము చేకూర్చు ననుటకు సంశయ ముండునా? ఇది లోకసహజము.

శర్మి: సహజము గానిమ్ము, అసహజము గానిమ్ము. ఈ మనోవికారము కొన్ని పర్యాయములు దుర్భరముగా నుండును.

నిర్మ: శర్మిష్ఠా! మీ తండ్రిని దేవదానవ యుద్ధమునుండి విజయ నుంది రానిమ్ము. అతడుచితవరుని వెదకి నీ కుద్వాహ మొనర్చి నీ మనోవికారము తీర్చును.

శర్మి: నిర్మలా! నీ పరిహాసములు చాలును. వలసిన వానిని మీ దేవయానియెడ ప్రయోగింపుము. నీవిట్లాడిన నే వెడలిపోయెద.

(పోబోవుచుండ)

దేవ: శర్మిష్ఠా! నిర్మల పలుకుల కలుక వహింపకుము. కన్యకలకు వివాహమనిన నింత కోపము తగునా? రారమ్ము. ఈ మలయ పవనుడెంత మందముగ వీచుచుండెనో చూడుము.

శర్మి: దేవయానీ! దీనికి గారణము నే నుడువుదునా?

తే॥గీ॥ రాత్రియంతయు బూతనిర్ఝరిణులందు
స్నాతులై ప్రభాతంబున వాత పోత
తతులు పుష్పిత లతలను దాక సంశ
యించి మెలమెల్లగా సంచరించు నువిద!

నిర్మ: బాగుగా వర్ణించితివి. శర్మిష్ఠా! ఎంత చతురమతివే!

( కచుఁడు దైవధ్యాన మొనర్చుచు దూరముగ ప్రవేశింప )

* (గీతము)

దేవ: (గానమాలించి) నెచ్చెలులారా! వినుడు వినుడు. ఏమీ గానమాధుర్యము! ఏ నారదుఁడో, తుంబురుఁడో, స్వర్గము నుండి యిటు వచ్చుచున్నాఁడు. లేకున్న సామాన్యునకిట్టి యసమానప్రతిభ గానమందుండుట యరిది. మనముపోయి చూతమా?

శర్మి: చెలీ! యతఁడిటే వచ్చుచున్నట్లున్నది. మనమెదురేగ నేల?

దేవ: ఈ కంఠస్వరమునకు జోడగు సౌందర్యమున్న నాతని బోలువార లీలోకమందుండరు.

(కచుఁడు పాడుచు ప్రవేశించి వారివంకఁ జూడక యే నిష్క్రమించును.) * (గీతము)

దేవ: (సంతోషభరిత స్వాంతయై) నెచ్చెలులారా! ఏమీ మహనీయుని యపూర్వ సౌందర్య గానామృత విలాసములు!

* (గీతము)

ఉ॥ క్రొన్ననవింటివాడో, నలకూబరుడో, సురనాధసూనుడో
ఇన్నవమోహనాంగుఁడు చెలీ! యిటువంటి వరిష్ఠరూపసం
పన్నుని నెన్నడైన మనవారల గాంచితే? ఇట్టి సుందరుం
గన్నుల విందుగా గనిన కామిని జన్మము ధన్యమొందదే!

శర్మి: చెలీ! ఈతడు మన్మథుఁడుకాడు. నలకూబర జయంతులును గాఁడు. ఎవడో బ్రాహ్మణుఁడుగా నున్నాఁడు. ఈతని నిట్లగ్గింప నగునా?

దేవ: మా బ్రాహ్మణకులస్థుఁడేయైన మా కులము వీనిజన్మమున ధన్యత నొందుట నిశ్చయము. నిర్మలా! అతఁడెట కేగుచుండెనో కాంచిరమ్ము. (నిర్మల నిష్క్రమించును.)

శర్మి: దేవయానీ! నీ స్వకులాభిమాన మెంత దృఢమైనదే? వాఁడెవఁడైన మనకేమి?

శర్మ: (ప్రవేశము) నెచ్చెలీ! అతఁడు మీ తండ్రిగారి యాశ్రమము ప్రవేశించె.

దేవ: అట్లయిన మనము సఖీ కేగుదము రమ్ము. అతఁడే కార్యార్థమై వచ్చెనో కనుగొందము. రమ్ము పోవుదము. (పోఁబోవుచుండ)

శర్మి: నేనును వచ్చెద నంత తొందర యేల? నిన్నాతఁడు మీ తండ్రి నడిగి యుద్వాహమాడ వచ్చినట్లు పరుగెత్తుచున్నావు. నిలువుము. నిలువుము.

( నిష్క్రమింతురు )

*

పంచమరంగము

స్థలకము: శుక్రాచార్యులవారి యాశ్రమము.

( శుక్రాచార్యుడు జపమొనర్చు చుండును. భాండాయనుఁడు పచర్య లొనర్చుచుండును. కచుఁడు ప్రవేశించుచుండును.)

కచు: దేవా! దానవాచార్యా! నమస్కారము.

తే॥ గీ॥ భార్గవకులాబ్ధి కైరవబాంధవాయ
రాక్షసౌఘసంత్రాణ పరాయణాయ
అన్య సూరి దుర్జేయ విద్యాన్వితాయ
పద్మగర్భప్రభాయ తుభ్యం నమోఽస్తు.

శుక్రు: కామ్యార్థ సిద్ధిరస్తు! భూసురా! నీ వెవడవు? ఎందుల కిటు వచ్చితివి?

కచు: దేవా! భృగుకుల తిలకా!

కం॥ ఏను గచుండనువాఁడ, మ
హానియమసమన్వితుఁడ, బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా! శిష్యవృత్తి బని సేయంగన్.

శుక్రు: ఏమేమీ? ఇది కలయా? లేక నిక్కువమా? నీవు బృహస్పతి సుతుఁడవా?

కచు: దేవా! అవును.

శుక్రు: శుశ్రూష యొనర్పవచ్చితివా?

కచు: అవును.

శుక్రు: ఏమీ విపరీతము! సురగురుసుతుఁడేఁడ? అసురగురుశుశ్రూషించి విద్యల నేర్వవచ్చుటేఁడ? సురలోకంబున నీకు గురువులే కరువైరా? ఇంత దూరము వచ్చితివి?

సీ॥ గురుఁడీతఁడే కాని పరులు గారంచుఁ గీ
ర్తినిగను నీ తండ్రి ధిషణుఁడుండ
అంబురాసుల నెల్ల నాపోశమించిన
కంజజప్రతిభుండ డగస్త్యుఁడుండ
త్రిణయను బాదహతిన్ గర్వ మడగించి
పేర్గన్న మాతాత భృగుఁడునుండ
విబుధాధి భర్తకు వేగన్నులిచ్చిన
యమలమనీషి గౌతముఁడు నుండ

తే॥ గీ॥ ఇంక వశిష్ఠాత్రిముఖ్యులు నెందరేని
విద్యలను నీకు నేర్ప ప్రవీణులుండ
వారినెల్లర విడనాడి వైరిపక్ష
పాతినగు నన్ను గొల్వంగ వచ్చితేల?

కచు: దేవా! మీ రెఱింగిన విద్యలు వారలకు దుర్జ్ఞేయంబులు గదా!

ఉ॥ వారలదండ విద్యల నవారిగ మామక బాల్యమాదిగా
నేరిచినంత, దామెవరు నేరని విద్యల నభ్యసింప న
వ్వారలు నన్ను మీకడకుఁ బంపిన వచ్చితి; మీరె దిక్కటన్
గారుణికంబుతోఁ గనినఁ గాదని త్రోసిన దైత్యశిక్షకా!

శుక్రు: (స్వగ) అక్కటా! ఇతని కేమని ప్రత్యుత్తర మిత్తు? ఈతని రూపం బమోఘముగా నున్నది. ఇతని ప్రార్థనంబున కీకొనిన నా పేరితడు నిలుపగలడు. కాని దీనికి నా యాశ్రితు లేమందు రో! అయిన నిట్లు చెప్పిచూచెదగాక! (ప్రకా) బాలకా! నాకడ మహర్షులుఁ నైత నెరుంగని విద్య లున్నను లేకున్నను సురపక్ష పాతికి నీకు విద్య నేర్పు టెట్లు? నీకు మా కలహంబు లెరుకపడి నట్లు లేదు.

చ॥ సురలు సురేశ్వరుండు మధుసూదనుడున్ మును మాకు మా
చరులకు మా సగోత్రులకు సల్పిన కీడిటువంటిదంచు నీ [పిశా
వెరుగవుగాక; లేనియెడ నిట్టుల గీప్వతి పుత్రకుండ వీ
వరిగెడువాడవోయి! మము యాచన సేయ గళాభిలాషివై?

కచు: ఆర్యా! సురాసురల వైరంబుతో నాకేమి పని? విద్యార్థికి నాకా ప్రశంస యెందులకు? అభ్యసింపదగిన సద్విద్య యెందున్న నందేగి దాని నభ్యసించుటయే కదా విద్యార్థి ధర్మము? మరియు మీరును మా తండ్రి మున్నగువా రందరును వాదోపవాదంబు లకు దిగిన దిగుదురుగాక. దాని నాధారము జేసికొని మీరు నా ప్రార్థనంబు దిరస్కరించుట ఆబోతు లాబోతులు పెనగులాడి లేగను ద్రొక్కినట్లగు.

(దేవయాని, శర్మిష్ఠ, నిర్మల ప్రవేశింతురు. దేవయా న్యాదులు శుక్రునకు నమస్కరింప)

శుక్రు: కళ్యాణమస్తు! అమ్మాయీ! ఇటు రమ్ము.

దేవ: (దండకేగి) తండ్రీ! ఈతడెవడు? మిమ్మేమి ప్రార్థించుచున్నాడు?

శుక్రు: ఈతడు బృహస్పతి యగ్ర సుతుడు. కచుడు. నన్ను విద్యాదాన మొసంగ నర్థించుచున్నాడు.

దేవ: అందులకు మీరేమంటిరి? అంగీకరింపలేదా?

కచు: (స్వగ) ఆహా! ఈ కాంతయే దేవయాని. ఈమె యనుగ్రహమే నాతండ్రి చెప్పినట్లు అసురానంద మొనర్చుటకు సాధనంబు. ఈమెను వేడుకొనియెదగాక. (ప్రకా) కాంతామణీ! విద్యాదానంబుత్తమదానంబని మీ తండ్రి యెరింగియు నేనమరుండననియు, నసురాపకారిననియు నాకద్దానిఁ బ్రసాదింప సంశయించుచున్నాఁడు. నీవు నాపక్షమూని, నన్ను దయగని, నా ప్రార్థన నంగీకరించు నట్లొనర్పుము. నీకాజన్మాంత మిందులకుఁ గృతజ్ఞుఁడనై మెలంగెద.

నిర్మ: చెలీ! ఈతని ప్రార్థనకీకొని నీకు నీ తండ్రియెడఁ గలచనువును బ్రకటింపుము.

దేవ: అట్లేయగుగాక. తండ్రీ! ఈ భూసురోత్తముడు నుడివినది వాస్తవమేనా?

( శుక్రుడూరకుండుటఁ గాంచి )

మ॥ తమ పాండిత్యమహత్వముం దెలిసి విద్యాదానలాభార్థియై
మిముఁ బ్రార్థింపఁగ వచ్చినట్టి యితనిన్ మీరంతరంగంబు నం
దమరుండం చసురాపకారియని కుయ్యాలింప కీరీతిగా
నమలోదాత్తమనీష! మీకగునె ప్రత్యాఖ్యానముం జేయుటల్?

ఈతఁడు బ్రాహ్మణుండు. బ్రహ్మచారి. విద్యాలలనా దానంబున కెంతయు నర్హుఁడు. ఇట్టి వానికి విద్య నేర్పకున్న ఆ విద్యవలన లాభ మించుకయైన గలదా?

శర్మి: గురువర్యా! ఈ కచుని ప్రార్థన కీయకొనుమని మీ పుత్రిక

నుడివె. మీరు నన్ను నా యభిప్రాయ మడుగకున్నను దానవ శ్రేయంబుఁగోరి నేఁ బలుక సాహసించెద. క్షమింపుము.

చం॥ అడిగినవాడు భూమిసురుఁడౌట నవశ్యమువానిఁ బ్రోవఁగా
నోడబడుటుత్తమంబనుచు యోజనసేయఁ గడంగుదేమొ ఈ
తడు తమదండనేర్చు వివిధంబగు విద్యల రాక్షసాళిఁ బె
క్కిడుమలఁ ద్రోయకుండడని యీరలెరుంగరొకో గురూత్తమా

దేవ: తండ్రీ! శర్మిష్ఠ మాటలకేమి? నేను 'ఎతి' యనిన నిది 'ప్రెతి' యనుట సహజమేకదా!

శర్మి: గురువర్యా! దీనికింతయాలోచన తగునా? తమరెరుంగని విషయమొండు గలదా? పాత్రునకు విద్యాదాన మొసర్చుటకంటె బుణ్య ముండునా?

కచు: దేవా? యేలయింకను దూష్ణీంభావమూనెదరు? నా కేదో యొకటి ప్రత్యుత్తరమిండు.

శా॥ విద్యాదానమొసంగు మంచదుగఁగా విద్వేషి విచ్చేసినన్
వేద్యంబైన సమస్తవిద్యలను సంవేదించి చేపట్టఁగా
నుద్యోగించునుగాని వేరనడు, కావ్యుండంచు నాలించి యి
ట్లుద్యోగించితినైన గాదనినచో నొండాశ కేనేగెదన్.

ఇంక మీరూరకున్నను మీ మౌనము దిరస్కార సూచకమని నే వెడలి పోయెద. (వెడలబోవ)

దేవ: తండ్రీ! నామాటల ద్రోస్వైచి యావిద్యార్థి బోవనిచ్చెదరా?

* (గీతము)

శుక్రు: (స్వగ) నా ముద్దుల పట్టి వీని విషయమున బట్టు పట్టియున్నది. సరే దాని యభీష్టమీడేర్ప నీతని శిష్యునిగా గ్రహించెద. మరియు నీతని బూజించిన బృహస్పతిఁ బూజించినయట్లగు. కావున

నట్లొనర్చెద. (ప్రకా) బాలకా!

చం॥ సురగురు పుత్రకుండవు విశుద్ధచరిత్రుడ వీవు; యామినీ
చరగురు నన్ను వేడుకొని శాస్త్రచయంబుల నభ్యసింపగా
నరిగిన నిన్ను నా సుత దయామతి బ్రోవుమటంచు బల్కె నిం
కరమర వీడి నీకు సకలాగమముల్ వివరింతు నిల్వుమా!

మరియు "నీ సుకుమారత్వంబును, నీ వినయ ప్రియవచన మృదు మధురత్వంబును, ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబును" నామది కెక్కె. కావున నాగృహంబున నిలిచి నా చెప్పు సకలవిద్యల నేర్చి, నీవు పేరు దెచ్చుకొని, నాకును బేరు దెమ్ము.

కచు: దేవా! అనుగ్రహింపఁబడితిని. తమ యాజ్ఞ శిరసావహించి తమ శుశ్రూష నొనర్చుచు బ్రహ్మచర్య వ్రత మాచరించుచు మెలంగెద.

దేవ: ఆ మాటకేమిగాని మా తండ్రి నిన్ను శిష్యునిగా నంగీకరించుటం జేసి ధన్యుడవైతివి.

కచు: లలనామణీ! ఇదంతయు నీ యనుగ్రహ ఫలముగదా? నీ ఋణ మే నెట్లుతీర్చుకొందునో?

శర్మి: (స్వగ) ఓహో! ఏమి వీని ప్రణయభాషణంబులు! కానిమ్ము. ఇదెంతకాలము? నాతండ్రిని యుద్ధరంగమునుండి తిరిగి రానిమ్ము వీరి పని బట్టించెద.

శుక్రు: అమ్మాయీ! అగ్నిహోత్రమునకు వేళయైనది. రమ్ము. పోవుదము.

( నిష్క్రమింతురు )

*

# అమరానందము

అను

# కచ - దేవయాని

## ద్వితీయాంకము

= ప్రథమ రంగము =

స్థలకము: వృషపర్వ నగరము. రాజవీథి.

(వృషపర్వుడు, కుంభనికుంభశౌండులు మున్నగు రాక్షసులు జయపతాకములతో, మంగళ వాద్యములు మిన్ను ముట్టుచుండ పుష్పమాలాలంకృతులై జయగీతముల పాడుచు ప్రవేశము)

* (గీతము)

వృష: అనుచరులారా! ఈ విజయోత్సవము విరమించి గృహముల కేగుదము రండు. (అందరు నిష్క్రమింతురు)

(యవనిక లేచును. శర్మిష్ఠ తన యంతఃపురమున నాలోచనా నిమగ్నయై యాసీనయై యుండును.)

శర్మి: * (గీతము)

మనమా! తొందరపడకుము. తాలిమి వహింపుము. క్షణములో తండ్రి రాగలడు. నీ యభీష్ట మీడేర్పగలడు. అతడు నిక్కముగ నీయెడ కచుడొనర్చిన యపరాధమునకు ప్రతికృతిగా నాతని నసురభూమినుండి త్రోలగలడు. అంతటితో కచుడు నాయెడ జూపిన నిరాదరణకు దగిన శాస్తి నందగలడు. లేకున్న దన యుద్యమంబును సఫలం బొనర్చుటకు దేవయాని యాశ్రయమే సమర్థమని యాతడు తలంపకుండునా? ఎప్పుడు చూచినను

పుష్పములచేతను, ఫలములచేతను, సేతలచేతను, గానముచేతను దేవయానిని మాత్రము తృప్తిపరచి నన్ను సరకుగొనకుండెగదా! కానిమ్ము. నేనుగూడ నాతనికి గార్యభాగి నొనర్పగలనని తెలిపెదగాక!

( వృషపర్వుడు వేగముగా వచ్చి శర్మిష్ఠ లేచి నమస్కరించు )

వృష: కళ్యాణమస్తు! తనయా! నీకు శుభంబే కదా?

( అక్కునజేర్చి ముద్దాడును )

శర్మి: తండ్రీ! మేమెల్లరము కుశలమే. మీ దండయాత్ర జయప్రదముగ ముగిసెనా?

వృష: ఆహా! అట్లే జరిగెను.

శర్మి: ఏవీ నాకు దెచ్చియిత్తుననిన యాభరణంబులు?

వృష: సేవకా! ఆభరణంబులిటు దెమ్ము. ( సేవకుఁడొకఁడాభరణంబుల దెచ్చినఁ గైకొని ) ఇవిగో! రంభాదుల యాభరణంబులొలిచితిని. బాగుగనున్నవా? సంతసమయ్యెనా?

శర్మి: నా సంతసమునకేమిగాని మీ విజయ వృత్తాంతము లించుక దెల్పుడు.

వృష: తెల్పుటకంత విశేషమేమియు లేవు. యుద్ధరంగమున దేవతలు ప్రతిదినంబును నిహతులుగా వారిసంఖ్య క్షీణించెను. మా సంఖ్య మృతసంజీవనీ విద్యచే నట్లేయుండె. దీనిఁజూచి వారు కారణము గనుగొన మన నికుంభునిబట్టి ప్రశ్నించిరట. అతఁడు వారికి రాక్షస మర్మంబుల దెల్పువాఁడు కాడయ్యె. (నవ్వుచు) తర్వాత వారు కొంతకాలము పోరాడి కప్పముఁగట్టుట కంగీకరించి సంధి చేసికొనిరి. తక్షణమే మేము స్వపురాభిముఖులమై వచ్చితిమి. ఇదంతయు శుక్రాచార్యుని కారుణ్యమాహాత్మ్యము. అతఁడు బ్రాహ్మణ బంధుడయ్యు సురద్వేషి యగుట మనకెంతయు శుభావహంబు

శర్మి: (నవ్వుచు) తండ్రీ! అదింకెంతకాలము?
వృష: పట్టీ! ఏమది? ఏల యట్లనెదవు? విశేషములేమి?
శర్మి: ఉ॥ ఏగతి విన్నవింతు ననురేశ్వర! మీరు సురేశు బోరఁగా
నేగిన కొద్దికాలముననే దివిషద్గురునందనుండు ర
క్షోగురుసన్నిధానమున సర్వము నేర్వఁగఁ గోరాఁగ నాఁకుహా
భాగుఁడు వాని వల్లనగ పాలనచేయు మనుండు ఛాత్రుగాన్
వృష: ఏమీ! సురగురుసుతుని మగురుండు శిష్యునిగాఁ జేకొనెనా?
మ॥ అసురశ్రేయము సర్వకాలముల సర్వావస్థలం గోరు నా
యసురాధ్యాపకుఁ డేమి? శత్రునకు విద్యాదానముం జేయ మా
నసముం దుందలపోయు టేమి? యిది సన్మానంబె? నే నమ్మనో
యసివృతేక్షణ! భ్రాంతియో? భ్రమయొ? మాయా స్వప్న
వృత్తాంతమో!
శర్మి: తండ్రీ! నీ ప్రియపుత్రిక మాటలయం దిట్టి యవిశ్వాస మెన్ని
నాళ్ళనుండి?
వృష: అమ్మాయీ! నీ వాక్యములయం దవిశ్వాసము గాదు. నీవు
పొరబడితివేమో యని యట్లంటి.
శర్మి: ఇందు నిక్కువముగా నే బొరబడిన సురుల కొంతయు శ్రేయ
స్కరముగదా.

* (గీతము)

వృష: ఆహా! ఇది నిక్కువమేనా? అయిన దీనికా భార్గవుం డెంసుల
కంగీకరించె?
శర్మి: ఆ మహానీయున కిష్టము లేకున్నను దేవయాని ప్రేరణంబున
కచుని శిష్యునిగా గ్రహించె. దేవయాని యతని సురూపంబును
గాంచి యతని వినయోక్తులకు మోసపోయి వాని శుశ్రూష
నంగీకరింపుమని శుక్రాచార్యుని నిర్బంధించె. దేవయాని తన

తండ్రిని తన ప్రేలిచుట్టు ద్రిప్పగలదని మీ రెరుంగుదురు గదా!

వృష: అవును. నీకు నట్టి ప్రతిభ గలదు గదా! అయిన నతడు నేర్వ దలచిన విద్య లేవి?

శర్మి: వాని నడుగవలయునా? ముఖ్యముగ మన మృతసంజీవనీవిద్య యే. అది లేనందువలననే కదా సురలు దానవులన్న దల్లడిల్లు చున్నారు!

వృష: బేలా! భయపడకుము. ఆ విద్య నాత డెప్పటికి నొరులకు నేర్పడు.

శర్మి: ఈ విషయమున మీకున్న ధైర్యము నాకు లేదు.

వృష: ఏమట్లనెదవు? ఆతడీ విద్యనుగూడ నేర్పునా?

శర్మి: నిస్సందేహముగా! కచుడు దేవయానిని తన వలలో వైచికొని యామెద్వారా శుక్రునిగూడా వశపరచుకొని యా మంత్రరాజ మును సంగ్రహించు. అమరలోక మేగి యమరవిజయంబు జేకూర్చు. అప్పుడు రాక్షసపరాజయంబు సంప్రాప్తించు.

వృష: ఆహా! అవునిది యాధార్థమే. ఇదే ఇపుడేపోయి యాకృతఘ్ను భార్గవు నుచితరీతి దండించెద. (కత్తిదూసి పోవుచు)

* (గీతము)

శర్మి: (అడ్డమునిల్చి వారించి) తండ్రీ! శాంతింపుము. గురువులయెడ నీ కోపము తగునా?

ఉ॥ అంబుజసంభవ ప్రతిము డా భృగుపౌత్రుడు విన్ను నీకు వం
శంబు గటాక్షమాత్రమున సంహరణం బొనగంపజాలు గా
నం బతిమాలుదాన సహనంబొకయించుక బూనుమయ్య సా
మంబునగాని దండమున మానుల నీకొనజేయ సాధ్యమే?

కావున మీ రేగి శుక్రాచార్యు డెట్లయిన నా కచుని దోలివైచు నట్లొప్పింపుడు. అతడట్లొనర్ప నంగీకరింపనిచో మనమే యాతని

యమపురి కనుపు వెరవాలోచింతము.

వృష: అట్లే యొనర్చి త్రుటిలో వచ్చెద.

( నిష్క్రమింతురు. )

*

## ద్వితీయ రంగము

స్థలము: శుక్రాచార్యు నాశ్రమము.

(శుక్రాచార్యుఁడు జపమొనర్చు కొనుచుండ భాండా యనుఁడు శుశ్రూషలొనర్చుచుండును. వృషపర్వుఁడు నికుంభునితో ప్రవేశించి)

వృష: గురువర్యా! తమ యాశ్రితుఁడు వృషపర్వుఁడు నమస్కరించుచున్నాడు.

నికుం: ఆచార్యవర్యా! తమ శిష్యుఁడు నికుంభుఁడు ప్రణామంబులొనర్చుచున్నాఁడు.

శుక్రు: (కన్నులుఁ దెరచి) విజయీభవ! మిత్రులారా! దేవాసుర సమరంబున విజయంబంది యెల్లరును సుఖముగా వచ్చితిరిగదా.

వృష: దేవా! అందులకు సందియమా? ఇదంతయు తమ యనుగ్రహ విశేషమే?

ఉ॥ నీ కృపచేతగాదె ధరణీసురసంభవ! నమ్ముఁబోలు దో
షాకులిత ప్రవర్తనులు హావడిచెందక దేవదానవా
నీకతలంబునందు మహనీయ ప్రరాక్రమధుర్యు నింద్రు న
స్తోకబలంబులంగలఁచి గుర్జయులైచరియించిమించుటల్.

నికుం: దేవా! మీ మృతసంజీవనీవిద్యాప్రభావబే మేమందరము

సుఖముగాఁ బ్రతికినచ్చుటకు గారణము. ఆ విద్య సురులకు రానంతవరకు మా విజయమునకు సందియము లేదు.

శుక్రు: మిత్రులారా! భయపడకుడు. అయ్యది ప్రాణతుల్యము. మీ శ్రేయోభిలాషుఁడనుగాదా?

వృష: గురూత్తమా! ఇట్లుమీరు దాని నెంత కాలముఁ గాపాడెదరు?

నికుం: ఎన్నాళ్ళింక మీవిద్య మీ దండ నుండగలదు?

శుక్రు: ఏమిట్లు లాడెదరు?

వృష: దేవా! మా సంశయములకుఁ గారణమును వినారింకను గ్రహింపలేదా?

చ॥ గురువర! మీరు దేవగురుకుంజరుపుత్రు కచాభిధేయు నా
దరమున నింటఁజేర్చి వివిధంబగు విద్యల నేర్పఁ బూనుచుం
టిరనుచు నా తనూజ ప్రకటించిన దానిని నమ్మలేక మీ
సరసకు నేగుదెంచితిని సత్యముఁదెల్పి యనుగ్రహింపుఁడీ!

శుక్రు: వృషపర్వా! ఇదిసత్యమే.

వృష: ఆర్యా! మీరిట్లొనర్ప నచ్చునా? సురగురుఁ డసురులకు విద్య నేర్పునా?

శుక్రు: వృషపర్వా! ఇట్లాడెద వేల? నేను విద్యాదాన మొనర్చుట నీకు గ్రొత్తయా? విద్యనర్థించినవానికిఁ జెప్పకుండుట ధర్మమా?

కం॥ దానములలోన విద్యా
దానంబుత్తమమని యుచితజ్ఞులు పలుకం
గా నీవు వినియు నిటు నా
దానంబును వలవదనెదె దానవనాథా!

వృష: దేవా! విద్యాదానంబును బాత్రులగుదనుజులకుఁ జేసిన నేను వలదందునా? ఇతఁడు వైరి శ్రేయోభిలాషి యగు బృహస్పతి సూనుండుగదా? వాని నింకేని తరిమివేయుఁడు.

శుక్రు: వృషపర్వా! నీవాతని నెఱిఁగిన నిట్లాడుదువా?

సీ॥ అధ్యయనంబున నసదృశప్రతిభతో
నిఖిలశాస్త్రంబుల నేర్చునతఁడు
పనిసేయఁబంచినఁ బదపడిఁ జేసెద
ననక తత్క్షణమున జనునతండు
నా మనంబున నేమి కామ్యించినను వేగ
దెలిసి యావైఖరి సలుపునతడు
జనమునఁ జెయ్వులమాటలభక్తి నో
కేవిధంబునఁ జరియించునతఁడు

ఆ॥వె॥ దేవయాని నతివిధేయుఁడై ఫలపుష్ప
దానములను నెపుడు దనుపు నతడు
అమరగురుతనూజుఁ డైనంతమాత్రాన
వైరి యనుచువాని వదలనగునె?

నికు: దేవా! మీరు వీని శుశ్రూషలచే మోసపోకుడు. ఇవన్నియుఁ గార్యసిద్ధికై వాఁడు పన్నిన పన్నాగములు. ఇష్టకార్య లాలసుల కిట్టి చర్యలు వింతయా?

వృష: గురువర్యా! వైరి యెట్టివాడయినను వానికి విద్యాదాన మొసంగవచ్చునా? మున్ను ధూర్తుఁడగు నధోక్షజుండు వామనుండై మన బలిని దానమడిగి దానవుల కెట్టి సిలుగులు గావించెనో మీ రెరుగరా?

శుక్రు: దానికి దీనికి సంబంధమేమి?

వృష: అట్లే యిప్పుఁడితఁడు విద్యాదాన వ్యాజంబున మనకు గీడు చేకూర్ప నున్నాఁడు.

శుక్రు: అదెట్లు?

వృష: దేవా? ఈతఁడు మీకు శుశ్రూష యొనర్చి మృతసంజీవనీ విద్య నెల్లైన సంగ్రహించి దానిని సురలకు నేర్పి మన విజయంబు

నకు భంగ మొనర్ప వచ్చియున్నాఁడు.

శుక్రు: దానిని విశ్వసించు టెట్లు?

వృష: లేకున్న సురగురుసుతుండేమి? యసురలోకమున కేగి యసురగురువును విద్యాదాన మడుగు టేమి? మున్నెవ్వరయినా నిట్లు వచ్చిరా? తమకడ మృతసంజీవనీవిద్య యున్నదని గ్రహించి యింద్రుఁడీతని దాని దొంగిలించుట కిట్లు బంపియుండును. ఇది నిర్వివాదాంశము.

నికుం: గురువర్యా! రాజేంద్రుని వచనంబులు సత్యనిరూఢము లు. ఈతని సక్కవినయంబుల నమ్మి మీరు చెడి మమ్ము జెరుపకుడు.

శుక్రు: ఏమీ ఇది నిక్కువమూ? అవును యదార్థమే కావలయును.

ఉ॥ ఇంతటిదాక నీ కచుఁ డహీనగుణుం డఘదూరుఁ డజ్ఞుడం
చెంతయు విశ్వసించి మునుపెవ్వరు నేరని దివ్యశాస్త్రసి
ద్ధాంతములన్నిటిం గఱపి ధన్యుని జేయదలంచితింక, ని
శ్చింతను వానిశాపహతుఁ జేసి దివంబున కేను ద్రోలెదన్

కచుఁ డిప్పు డుద్యానవనంబున నుండు. నేనచ్చటి కేగి వాని దరిమి వేసెద. మీరును నాతోడవచ్చి యుపవనద్వారంబున నుండుఁడు.

( నిష్క్రమింతురు. )

*

# తృతీయరంగము

స్థలకము: ఉద్యానవనము

(నిర్మల ప్రవేశము)

* ( గీతము )

నిర్మ: ఆహా! నెచ్చెలి చిత్తభ్రాంతికే మందు. దుర్లభుండగు భూసుర తల్లజుని వల్లభుగాఁగోరి తల్లడిల్లుచున్నదే?

తే॥ గీ॥ బాలమదినాఁడు విత్తినప్రణయబీజ
మనుదినస్మరణాంబుల గొనుచుఁ దీఁగ
సాఁగిసాఁగి కచవిటపాశ్రయముఁగోరి
దాసిగాఁచక నెమ్మది తల్లడిల్లు.

అక్కటా! యీ వ్యామోహవశంబున నీ లోకంబంతయు కచమయంబు గాఁగోరుచుండు. మనోవాక్కాయంబుల కచుని దలుచుచు కచుని బ్రశంసింపుచు, కచుని సేవింపుచుండును. ఇతరంబు నేవగించుచుండు. మరియు

ఉ॥ ఆళులు గుంపుగూడిన రహస్యము లాడిన నవ్వులాడినన్
బేలమదీయ మోహమును వీరలెఱింగి యిటుల్ చరిత్రతు కా
బోలునటంచు భ్రాంతిపడి మోమురవాంచుచు లేనిపోని గ
గ్గోలుపహించు గ్రామకులు గుమ్మడికాయల దొంగలారయన్

పిల్లి కన్నులుమూసి పాలుద్రావుచుఁ బరులెఱుంగ రనుకొనునట్లు దేవయాని తనకు గచునిపై గల మోహంబును తన చేష్టలబట్టి మే మెఱుంగమని తలచుచున్నది. అక్కటా! యే యగ్నినయినను దాచవచ్చునుగాని మోహాగ్ని దాచ నేరికి శక్యము? ఇంతకును నెచ్చెలి నోరువిచ్చి సిగ్గు నవలబుచ్చి దన మోహంబు తెల్పకున్నది. కాదుకాదు. తెలుపలేకున్నది.

చం॥ అసమశరుండు వేచ హృదయవ్యథ హేతువు నాకుఁ దెల్పగా
విసవిస నేగుదెంచి వెనువెంటనె సిగ్గు కురంగలింపగా
విసుకున వెక్కసేగి యలివేణి విరాళిని గూనుచుండుపో
ముసుకున గ్రుద్దులాటలుగ ముగ్ధరహస్య వికాసయత్నముల్.

కానిమ్ము. సమయము వేచి నెచ్చెలి రహస్యంబు నా మెనోట విని కర్తవ్యమొనర్చెద.

( నిర్మల నిష్క్రమించును. యవనిక లేచును. కచదేవయానులుద్యానవనంబునఁ బుష్పములఁ గోయుచుందురు. కచుఁడొక బుట్టఁబట్టి దేవయాని పుష్పములు గోయుచుండ వెన్నాడుచు బోవుచుండును. )

కచు: దేవయానీ! నేటికీ పుష్పంబులు చాలు. నీకుఁజాల శ్రమయయ్యె. రమ్మింక విశ్రమింతము.

దేవ: కచా! నీవుదండనుండ నాకు శ్రమయే తోచుటలేదు. అయిన నీ యభీష్టానుసారమే కానిమ్ము.

(దేవయాని యాసీనగాగ కచుడు పాదములకడ గూర్చుండి పుష్పములందియ్య దేవయాని దండలు గట్టుచుండును. ఫలములందియ్య దేవయాని భుజించి)

దేవ. కచా! నాకిక ఫలములు వలదు. నామనంబున నానందంబు వెల్లివిరియుచో నాకలి యెట్లుగు? ఇంక కొన్నిటి భుజించి నీవు నిన్నటి రాగములు మరలఁ పాడుము.

కచు: సోదరీ! నీసంతసమేగదా నా సంతసము. అట్లే యొనర్చెదను.

* (గీతము.)

దేవ: భళీ! కచా! భళీ! నీ రూపమెంత మనోహరముగ నున్నదో, నీ గానమంత హృదయంగమముగ నున్నదోయి. ఇట్టి గానమెక్కడ నేర్చితివి.

కచు: నారదుఁడే స్వయముగా నాకు నేర్పె.

దేవ: ఎంతధన్యుఁడవోయి. నీ బోటిపుత్రునిగాంచ నా తారా బృహస్పతు లేతపంబొనర్చి, యే నోమునోచి యే దేవతలకు మ్రొక్కిరో గదా.

కచు: సోదరునిట్లు గ్రింపకుము. నీవుగూడా పాడిన నిక్కముగా నేను ధన్యుడనయ్యెద. నిర్మలయు లేదు. కావున నిదియే సమయము. పాడుము. నిన్ను వేడెద.

దేవ: కచా! నీ యభీష్టము నా కాజ్ఞగదా.

* (గీతము)

కచు: దేవయానీ! పాట బహు శ్రావ్యముగా నున్నది.

దేవ: అయిన యీ పాటతోసరియౌ (ఒక్క పూలదండ నెత్తి) దీనిని ధరింపుము.

కచు: దేవయానీ! నీవు నా బ్రహ్మచర్య వ్రతంబును మరచితివా? వ్రతనియమంబునకు స్రక్చందన ధారణాంబులు తగవుగదా? ఇంత మాత్రమిూ వెరుంగవా?

దేవ: అబ్బా! నీ మూర్ఖపు పట్టుదల మానవుగదా? మిత్రా! నీ యందన్నిటిని నేను మెచ్చెదగాని యీ బ్రహ్మచర్య వ్రతదీక్షను మెచ్చను. ఏలయన.

చం॥ తరుణవయస్సు భోగముల దామరతంపర నందు కాలమం
దెరుగవుగాక, లేనియెడ నిట్టుల నిచ్చలు బ్రహ్మచర్యముం
జరుపుచు సర్వకామ్యమగు సంసృతిసౌఖ్యమువీడి కాననాం
తరమున జోత్స్న వైఖరి వృధాయొనరింతువె దానిమిత్రమా.

కచు: సోదరీ! అట్లనకుము. నాకు భోగాపేక్షయున్న నీవు చెప్పిన మార్గము సుఖదాయకమే కాని వాంఛయే లేదు. అట్టియెడ నాకీ బ్రహ్మచర్యమే సుఖప్రదమని తోచుచున్నది. మఱియు సుఖమనునది మన కభ్యంతరమైనది గాని బాహ్యమైనది గాదు.

ఆ॥ వె॥ ఇది సుఖంబుఁ గూర్చు నది యసుఖము గూర్చు
నంచు నెంచఁగునె యందరకును
జిత్తశుద్ధిచేతఁ జేకూరెడు సుఖంబు
సుఖముగాని వేరు సుఖము సుఖమె.

అదియునున్నాక సుఖప్రదములెవ్వియో, యావే యసుఖప్రద
ములుగదా?

దేవ: ఇట్టులాడిన నీకు నీతో మాటలాడను.

కచు: దైవముట్టి విపత్తునుండి నన్ను రక్షించుగాక. (నిర్మల సత్వర
ముగా ప్రవేశించు)

దేవ: నిర్మలా! ఏమీయంతత్తరపాటు—ఏమి విశేషము.

నిర్మ: నెచ్చెలీ! ఏమనిచెప్పుదును. మీ అన్యోన్య సంయోగమునకు
నేడు ఋణము దీరె.

కచు: నిర్మలా! ఏమన్నా చెదవు. ఏమి జరిగె.

నిర్మ: నెచ్చెలీ! నాకు నుడువ నోరాడకున్నది.

ఉ॥ భూరి జయోపలబ్ధి గురుపుంగవు సన్నిధి కేగుదెంచి, యు
ద్ధారపరాక్రముండు వృషపర్వుఁడు గీష్పతిసూతి విద్యలన్
నేరుపకుండఁబంపఁ గరణీయముమటన్న గురుండు వచ్చునో
నీరజనేత్రి! నీ హితుని నీటను ముంచెదొ పాలముంచెదో.

కచు: నిర్మలా! ఇది నిక్కువమేనా? అక్కటా! ఇఁకనేమిసేయుదు.
దేవయానీ! మున్ను నాకు శుక్ర శుశ్రూష భాగ్యము చేకూర్చినది
నీవు. ఇప్పుడు నీవే దానిని నిలువబెట్టవలయును.

దేవ: కచా! భయపడకుము. నిన్నెట్లయిన నా తండ్రితో మాట్లాడి
యుండు నిల్పించెద. అదిగో! మాతండ్రి వచ్చుచున్నాడు. నీవు
పోయి యా నికుంజంబున డాఁగి యుండుము (కచుడట్లొనర్చును)
నిర్మలా! నీవీ పూలనన్నిటి నేరుచుండుము. (నిర్మల పూల నేరు

చుండ శుక్రుడు కోపముతో (ప్రవేశించి)

శుక్రు: శా॥ ఓరీ ధూర్త శిరోధి! ఓరి కచ! కావ్యున్ మోసమ్ముం జేసి నే
నీ రక్షోగణపాలనార్థమయి యెంతే రక్షణం జేయు వి
ద్యా రాజంబును సంగ్రహించి చనగా నాలోచనల్ జేసితే
ఏరా! ఎక్కడ నున్నవాఁడ విటురా! ఏడాటలాడించెదన్.

దేవ: (స్వగ) అక్కటా! నా తండ్రి ప్రళయకాల రుద్రునివలెఁ గ
న్నుల నిప్పులు గ్రక్కుచు వచ్చుచున్నాఁడు. ఇతని ననునయించు
టెట్లోగదా?

శుక్రు: దేవయానీ! ఏడీ యా కృతఘ్నుండగు కచుం డేడీ?

దేవ: తండ్రీ యెందులకు? అత డిప్పుడే యాశ్రమాభిముఖుఁడై పోయె.

శుక్రు: ఆశ్రమమునకేగినా? సరే! నేను నక్కడికేగెద. (పోబోవుచుం
డ చేబట్టి తెచ్చి)

దేవ: తండ్రి! యిదేమి విపరీతచర్య? కచుఁ డెట్టి యపకార మొనర్చె?

శుక్రు: ఏమి యపచార మొనర్చెనా? నన్ను వదలుము. పోయి వాని
పనిబట్టించెద

దేవ: ఉ॥ ఎన్నడుగాని కోపము వహింపని శాంతచరిత్రు వీర లా
యన్న వ బహ్మచారి పయినా సుకళాభ్యసనాభిలాషుఁడై
నన్నమి దేమొ కాని యిటు లాగ్రహమూనగ నేమి కారణం
బున్నదొ తెల్పకుండ నిటులూరక కోపమొనర్ప బాడియే.

శుక్రు: పట్టీ! ఏమని చెప్పఁగలను? అతఁడన్నము పున్నమెరుంగని యా
మాయకుఁడని దండఁ జేర్చిన నా కన్నుల మన్నుజల్లి, నా యభ్య
సించిన మృతసంజీవనీ విద్యారాజంబును సంగ్రహించి యసుర
నాశంబునకై యుద్యమించుచున్నాఁడట. అట్టివానిని కరుణతో
జూచిన పాపముగు. నన్ను వదలుము. వానిని యుచితరీతి దండింతు.

దేవ: తండ్రీ! యిది మీకెవ్వరు తెల్పిరి.

శుక్రు: నాయాశ్రితుఁడు వృషపర్వుఁడు.

దేవ: అక్కటా! వృషపర్వునిమాట నమ్మితిరా? మీ శిష్యశేఖరుని సజ్జనసంస్తూయమాన చరిత్రుని దండింపదలఁచెదరు? అతడు బృహస్పతితో వైరంబునను సంజీవనీవిద్యారక్షణాసక్తిని లేనిపోని కల్పించెఁగాని యిది నిజమా?

శుక్రు: నిజముగాకిది యబద్ధమా?

దేవ: నిస్సంశయముగా. మీరు నేర్చినవిద్య నతడెట్లపహరింపగలడు? మీకు శిష్యుండని దయగని చెప్పిన నేర్వగలఁడుగాని వేరుపథమున దాన్యభ్యసింప నేర్కెన సాధ్యమా?

చం॥ కచుఁడెది పిన్నవాఁడినను, భార్గవు డయ్యది విశ్వసించు నం
చెరిఁగిన వాఁడుగాన నసురేశ్వరుఁడెంతయు సాహసించి యా
గురుసుతుపైన గొండెములఁ గొన్నిటిఁ గల్పనజేసి తెల్ప మీ
రరమర వీడితండ్రి! యిటులారడిబుత్తురె శిష్యశేఖరున్.

శుక్రు: దేవయానీ! నీకు కచుని గూర్చి తెలియును. వానిని నాకు వదలుము.

దేవ: తండ్రీ! ఇంకను మీరిట్లులుక బూననగునా? కచుని నైజము మీరెరుంగనిదియా? వృషపర్వుడు మీరు కచుని శుశ్రూషకు మెచ్చి మృతసంజీవనీ విద్య నాతనికి నేర్పెదరేమోయని భయపడి కచుని దరిమి వేయనున్నాడు. అతని దండకేగి 'మీరేమియు సందడగంబు నాతనియెడఁ జేయకుఁడు, నేనాతనికి మృతసంజీవనీ విద్య నేర్ప' నని తెల్పుడు. అంతతో సంతోషమంది యతఁడింటి కేగును. మీరును నాకును గూడ సంతసమగు. ఇఁక సంశయింపకుడు. (మోకరించును)

శుక్రు: పుత్రీ! యట్లొనుడివెదను లెమ్ము. వృషపర్వుండు నాకై వేచి యుండును. వానితో నీసమాచారముఁ దెల్పి వచ్చెద. నీవింక

నాశ్రమమునకుఁ బొమ్ము.

(నిష్క్రమించును)

*

## తృతీయ రంగము

స్థలము—ఉద్యానవన ప్రాంతభూమి

[నికుంభునితోడ వృషపర్వుఁ డిటునటు తిరుగుచుండును]

వృష: ఏమిది యెంతసేపయినను గురువర్యుని జాడయే లేదు. క్షణములో నా కచుని జుట్టుబట్టి యీడ్చుకొనివచ్చి మీ ముందర వాని నుచితరీతి దండించి దేవలోకంబునకు బారఁద్రోలెదనని గురుండు వాక్రుచ్చియు నిట్లు తడవు సేయుచున్నాఁ డేల? కచుఁ డేమయిన నుద్యానవనంబున లేకుండెనా? ఛీ! అదెట్లు పొసగును? గురుకార్యంబు లేనపుడు కచుడు దేవయానికడఁ గాక వేఱుచోట నుండఁడు. ఇది కల్ల. ఇంక నాతఁడచ్చట నుండినను గురువర్య క్రోధంబు నుండి దేవయాని యాతని రక్షింపఁ బూనుకొనియెనా? ఇదియే నిజమయి యుండనోపు. దేవయాని కచుని మోహించి వానివలలో దగుల్కొని, యాతని చేతిలో గీలుబొమ్మయై యున్నది. అట్టిచో నా తన్వి గాక కచప్రవాసము ఇంపగునా? ఆ తన్వియే గురువర్యుని కార్యదీక్షను, తన సాంత్వనోక్తుల తర్కనోక్తుల భంగ మొనర్చి యుండు. ఆ తన్వి మాటయే వేదవాక్యముగ విశ్వసించు గురుండామె ప్రార్థనఁ ద్రోసిసేయునా? అక్కటా? ఈ కచదేవయానుల విట కోలాహలము మా యసురధ్వంసంబునకు మూలబీజముగా నున్నది. ఏమి సేయుదును? (శుక్రుడు ప్రవేశించును)

నికుం: అసురేశా! గురువులవారు విన్నవదనులై వచ్చుచున్నారు.
వృష: గురువర్యా! కచు డేడీ?
శుక్రు: వృషపర్వా! కచుని మాట యటుండ నిచ్చి నా మాట విను ము. మీకు కచుని పైం గల కార్పణ్యమునకుం గారణ మాతనికి నే మృతసంజీవని విద్య నేర్పుదునని కదా?
నృష: దేవా! కొంత వఱకు మాభయం బదియు.
శుక్రు: అదియే ముఖ్యకారణము కాబట్టి మరేమియు దుండగంబు నా యెడ జేయకున్న నేనాతనికి మృతసంజీవనీవిద్య నేర్పను. నామాట విశ్వసించి స్వస్థచిత్తులరై మీగృహంబుల కేగుఁడు. మీ కెప్పటికి కచుని మూలమున విపత్తు గలుగకుండ జూచెదను.
నృష: దేవా! మీరాతని బాఱకోలినగాని మనఃస్వాస్థ్యము దుర్లభము మీమాటలు కొంతవఱకు మాకుపశాంతిఁగల్గించెను. కాని యేవే ళకు మీ మనసెటు మారునోయని...
శుక్రు: వృషపర్వా! ని భయంబు నీకు నా మాటయెడ నుండవలసిన విశ్వాసమును బోఁగొట్టుచున్నది. నీవేమి చెప్పినను నిదియే నా కడపటి మాట. దానిని మనసున నుంచుకొనుము. పూజ వేళ యైనది. (నిష్క్రమించును)
వృష: నికుంభా! చూచితే, గురువర్యునకు మనపైఁగోపముకూడ వచ్చి నది. దీనికంతకు నాకచదేవయానులే బాధ్యులు కారకులు. కాని మున్ను. దీనికి దగిన ప్రతిక్రియ జేయ లేకున్న నేన్వృషపర్వుఁడ నేనా? ఈ నాటనుండి వీరి నెడదీయు ప్రయత్న నిమగ్నుఁడనై యుండెద. కచుని మనము లైనఁ గడతేర్పఁగల మేని వారిద్దరిపై మనకుఁగల క్రోధము తీరును. "ఏక క్రియా ద్వ్యర్థకరీ" యనునట్లగును. అందు లకు నీవు బూనుకొనవలయును.
నికుం: దేవా! గురువర్యుని మాట యందు విశ్వాస ముంచి కచుని జోలికిఁ బోకుండుట శ్రేయస్కరముగాదా?

వృష: ఛీ!-ఛీ! నికుంభా! నీవిట్లనదగునా? కచుండాచార్యుని శుశ్రూషిం చుచున్నంతవరకు, దేవయాని యతని ప్రేమించుచుండు నంతవర కు మనకు శ్రేయస్కరమెక్కడిది?

* (గీతము) (నారదుండుపాట బాడుచుఁ బ్రవేశించును)

వృష: నికుంభా! అదుగో నారదమునీంద్రుఁడు వచ్చుచున్నాఁడు. అతఁడు సురపక్షపాతి. అతనినడిగి మన భిన్నాభిప్రాయముల దిద్ది కొందము. (నారదుఁడు ప్రవేశింప) విరించినందనా! అసురేశ్వరుం డు వృషపర్వుఁడు నమస్కరించుచున్నాడు. (నికుంభుఁడుగూడ నమస్కరించును.)

నార: వృషపర్వా! కల్యాణమస్తు.

వృష: మునీంద్రా! తామిందు విచ్చేయ మా జన్మము ధన్యమైనది.

నార: అసురేశా! ఆకాశ మార్గంబున బోవుచు నిన్నిచ్చోటఁదిలకించి నీ కుశలవార్త శ్రవణానందముగ వినిపోవచ్చితిని. నీ ముఖంబున దైన్యము, సంశయము, క్రోధము, ముప్పిరిగొని తాండవ మాడు చున్నవి. సురజేతవు నీ విట్లుండుటకు గతంబెద్ది?

వృష: ఉ ॥ ఏమని విన్నవింతును మునీశ్వర చంద్రమ! మొన్న మొన్న సుత్రామగురూద్భవుండు, కవి దండకు విద్యలఁగోరి రా నతం డేమఱుఁచందుకీయకొని యేమిఁవచించిన వాని వీడఁడం చేమియు దోఁచకున్నదిక నెయ్యది కార్య మనుగ్రహింపుడీ॥

నార: (నవ్వుచు) ఓహో! శుక్రాచార్యుండు మీరెంత బోధించినను గచుని వదలననుటయా నీచింతకుఁ గోపమునకుఁగారణము. అయి న నీ వేమి చేయుదలంచితివి?

వృష: ఏమున్నది. ఆకచుఁడకాక్కడి యసురోపద్రవము రాకుండ జే యుటయే.

నికుం: మునీంద్రా! మాకు శుక్రాచార్యుండు "మీరేమియు నాయెడ

దుండగంబు సేయకున్నఁగ చునకామృతసంజీవనీవిద్య నేర్పనని వాగ్దానమొనర్చె"అంచు చేనేను, మా రాజున కా మహాత్మ్మమాట విశ్వసించి సైచియుంచుట శ్రేయస్కర మంటిని.

నార: నికుంభా! నిను బోలు ధీమంతుడు వృషపర్వునకు మంత్రియై యుంట యెంత పుణ్యమో యీ

నికుం: ఆర్యా నాబోధయందేమైన దప్పున్న నన్ను క్షమింపవలయు.

నార: క్షమించుట కేమున్నది కాని శుక్రాచార్యుని సత్యవ్రతదీక్ష నీ వెరుంగవా? అతడు వలసిన బొంకక వచ్చుననలేదా? మఱియు పాత్రుండగు శిష్యుం డుపాధ్యాయుని హృదయమెట్లు కరిగించునో నీకు దెలియునా?

నికుం: ఆర్యవర్యా! తెలియునుగాని....

నార: తెలిసిన నీవిట్లు వృషపర్వునకుఁ బోధింతువా?

వృష: ఆర్యా! మీ అభిప్రాయ మెఱిగించి మమ్ము ధన్యులఁజేయుడు.

నార: వృషపర్వా! ఇంకను గనుఁగొనలేదా?

మ॥ దితిజాచార్యుని కన్నులం బులిమి యంతేవాసియై యెట్టులేన్
మృతసంజీవని నభ్యసించి సురభూమింజేరి దైతేయ సం
తతి విధ్వంసము నాచరింప నమరానందంబుఁ గావింప, నుద్యతినే తెంచిన యీ కచుం డెనక యేఁగా మీకు సందేహముల్.

వృష: భళీ! విధిపుత్రా! బాగుగాఁ జెప్పితిరి. నికుంభా! వింటివా? నారదోపదేశము.

చం॥ మునివరచంద్ర! నేను దలఁపోసిన యట్టులె మీరుగూడ నా
కనుమతి యిచ్చియుంట హృదయంబున సంశయమెల్లదీరె
వెంటనె గురుపుత్రుఁబట్టి హననం బొనరింపగ నాభటావళిం
బనిపి సురప్రయత్నముం భంగమొనర్చెద వాఁడ నమ్మఁడీ.

నార: అసురేశా! యట్లొనర్చి మనోరథసిద్ధినిగని కృతార్థుఁడ వయ్యె

దవుగాక.

వృష: దేవా! మీ యాశీర్వచన బలంబున నట్లగు టెంత? నికుంభా! కచుండు శుక్రశిష్యులందరం బోలె వనంబునకు హోమధేనువులం గొనిపోవు. అతండెచ్చో డేగునో వేచియుండి వాని బలియిమ్ము.

నికుం: దేవా! మీయాజ్ఞ శిరసావహించి వర్తించెద.

నార: వృషపర్వా! నేబోయివచ్చెదను. అప్రమత్తుడవై కార్యమును జక్క బెట్టుము.

వృష: మునీంద్రా! అట్లేయొనర్చెద. నాకు సెలవిండు. ఇంకం గచుండు మరణించెననియే తలంపుడు.

(నికుంభ వృషపర్వలు నిష్క్రమింతురు) * గీతము

నార: (నవ్వుచు) భళి యను రానందమున కంకురార్పణ మొనర్చితిని. ఇంకం గార్యంబు సత్వరంబ సఫలమగు. ఇంతులకీ వృషపర్వునికి శుక్రునెడగల యవిశ్వాసము, కచునియెడంగల భయము, అసురులయెడంగల యభిమానము నాకుం దోడ్పడియె. కానిమ్ము. ఇతండు గచుని జంపించు యత్నములు దేవయాని ప్రేమంబున నిష్ఫలంబగు. భార్గవునకుమాత్రము వీనియెడం గోప ముదయింప జేయు. క్రమ్మరవచ్చి కార్యంబు సాంత మొనర్చిపోయెద.

* గీతము

(నిష్క్రమించును)

*

## పంచమ రంగము.

స్థలకము—కాంతారము.

(కచుఁడొక చేత సమిధలను, దర్భలను బట్టికొని భుజముపై నొక కట్టెలమోపునుదాల్చి గోవుల దోలుచు పాడుచు ప్రవేశించును.) * గీతము

కచు: అక్కటా! ఆశ్రమభారంబు దుర్భర మగుచున్నది. ఈ దినపతి తన యిన మిత్ర లోకబాంధవ నామంబుల సార్థంబులుగ జేసి చండకిరణ నామంబు సార్థకంబుగఁ జేయుచున్నాఁడు. ఇంచుకసేపు గోగణంబులతోడ నీ వటవృక్షచ్ఛాయ విశ్రమించి యాశ్రమంబున కేగెద. (విశ్రమించి నిట్టూర్పువిడిచి) ఆహా నా కష్టంబు లెప్పటికి గట్టెక్కు? వానిఁగూర్చి తలచినంతనె నాహృదయము జల్లు మనుచున్నది. నిలువు నీరగుచున్నది.

ఉ॥ కన్నులు మూయుచుండెరచు కాలములోపల శుక్రు గొల్చి వి
ద్యోన్నతి మించి క్రమ్మర సురోర్వికి వచ్చి సురా సురాహవా
పన్న సుపర్వ సంచయముఁ బాలన సేయఁగఁ బగ్గెలాడి యుం
దన్న విధాన నట్లు సలుపన్ దలపోయక యుంట చెల్లునే?

అక్కటా! యేమి చేయుదు? ఎంత శుశ్రూష యొనర్చినను గురువర్యునకు నాయెడ గరుణ గలుగదాయెను. ఎప్పటికి నా విద్య లభ్యమగునో, యెన్నడు నా తలిదండ్రుల జూతునో, యెన్నడ మరానందమొనర్తునో తెలియకున్నది. ఇది యిట్టులుండ గొలది దినములనుండి యీదానవ హంతకులు నన్ను సహస్ర నేత్రములతోఁ గనిపెట్టుచున్నారు. ఎందులకో? వీరిచర్యలచే నాకు విహ్వల చిత్తమేర్పడి, చిత్త స్థిమితము గలుగకున్నది.

చం॥ నను దిలకించినంత నయనమ్ముల నెఱ్ఱగఁ జేసి చూతు రే

మని వచియించినంత బదులాడక తర్జనభర్జనంబు లా
ననమున దోప బోయెద రనారత మీ దితిపుత్రు లింక నే
యానువున జేతురో హృదయమందలిమర్మమునున్ గ్రహించినన్
కానిమ్ము యేమెనర్చినను నాకు మృతసంజీవనీ విద్యలభింప జేసిన
నే కృతార్థుడనగుదు. ఇందులకు, నిజభక్తవశంకరుడగు సారసాక్షుం
డు దోడ్పడు గాక.

* (గీతము)

(పాడుచుండ నికుంభుడు, త్రోవతీయు, దండుడు, కుంభుడు పొంచి
పొంచిచూచుచు వంగి వంగి నడచుచు, కచుని జూసి)

నికుం: ఓరీ భూసురాధమా? యెవడవురా నీవు?

కచు: అసురాగ్రణీ! నేను శుక్రశిష్యుండను.

నికుం: నీవేనా సురలోకము నుండీ మాగురువును శుశ్రూషింపవచ్చి
నవాడవు?

కచు: అవును. అయిన నాతో మీకు బనియేమి?

నికుం: పనియా? చెప్పెదనుండుము. ఓరీ రాక్షసులారా యీ ధూర్తుడే
మన గురువునుండి మృతసంజీవనీవిద్య దొంగిలింప వచ్చిన సురుల
వేగువాడు. దయాదాక్షిణ్యములేక వీనిని కొట్టుడు. నఱకుడు.
చంపుడు. చింపుడు.( రాక్షసులు కచుని చుట్టుముట్టి బాధింప)

కచు: అయ్యో. అయ్యో. (అరచుచుండ, దండుడు, కుంభుడు వా
నిని భల్లములతో పొడిచి వేయుదురు)

నికుం: భళీ బాగుగ జేసితిరి. ఇక వీని కళేబరంబు నీ విటపంబునకు
గట్టుడు. (అట్లొనర్చ) ఇక రండు. మన నృపాలునిదండ కేగి యీ
సంతోష వార్త దెలిపి బహుమతు లొందుదము.

(నిష్క్రమింతురు)



## షష్ఠ రంగము

### స్థలకము—శుక్రుని యాశ్రమము.

(దేవయాని చింతాకులమానసయై విషణ్ణవదనయై కూర్చుండి)

దేవ: అక్కటా! యేమిచేయుదును? నా మానసమే నాయెడ ద్రోహ మొనర్చె.

ఉ॥ ఆ కమనీయరూపుఁ గనినంతనె యేమివిచిత్ర మాత్మబా
హ్యాకృతి మార్పు నిం దుకయు నందక యంతయు నిల్చెగాని లో
నూకొను నంత రంగమెటులో నటునాయుముగా జరించె నా
హా! కరిరాజ కుక్షిగతమై బయలొందు కపిత్థముంబలెన్॥

అక్కటా నా మానసం బేమయ్యెనో? అది పరవశంబయి యుండ నాకు శుభమెక్కడిది? సుఖ మెక్కడిది?

కం॥ మన మొకటెగ నాకు జనన
దినమాదిగ గూడియుండితిమిగా మనమా!
చనదగునే యపరిచితుని
గనుగొనినంతటనె నన్ను గాదని యిటులన్?

ఈ కచుని బ్రహ్మచర్యవ్రత నియమంబెన్నడు సాంతమగునోయని యువ్విళ్ళూరుచుందు. ఎన్నడు నన్నాతండు పరిగ్రహించునోయని గ్రుక్కిళ్ళు మ్రింగుచుందు. అక్కటా! నన్నుబోలు మందభాగ్య కట్టి మహదానంద మబ్బునా?

నిర్మ: (తత్తరపాటున ప్రవేశించి) నెచ్చెలీ! మీ తండ్రిగారిటే వచ్చుచున్నారు.

(దేవయాని యాసనమునుండి లేచి, తన వసనమును సవరించుకొని నవ్వుచు, తండ్రికెదురేగి నమస్కరించి తోడ్కొని వచ్చును.)

శుక్రు: కల్యాణమస్తు! తనయా! నీకు భద్రమే కదా?
దేవ: తండ్రీ! భార్గవాత్మజకు సుఖముగాక వేరగునా?
శుక్రు: పుత్రీ! నీవెంత దాచినను, నా ప్రేమపూరితమగు నేత్రములకు నీవసుఖము నందుచున్నట్లు తోఁచుచున్నది. దానికేమి కారణము?

చం॥ కిలకిలనవ్వి ప్రేమ తులకించెడు చేతలఁ జేసి, ముద్దులం
గులికెడు మాటలాడి, నెటికూటములొాల్కెడు పాటపాడి న
న్నలరఁగ జేయు నీవు కచునాగమనాహ్నముగోలె, నొక్క టే
న్నలుపఁదలంపవేమి గ్రహచార మొ దెల్పగ రాదె యాత్మజా

దేవ: తండ్రీ! ఇది మీభ్రాంతియకాని, వేఱుకాదు. మీరు నన్ను దినము కంటిని ఱెప్పంబోలెఁ బోషించుచుండ నాకెట్టియాపద రాగలదు? నామాట నమ్మకున్న నిర్మలనే యడుగుడు.
శుక్రు: ఏమే! నిర్మలా! నీకు దేవయాని యందే మార్పును గోచరించుట లేదా?
నిర్మ: నాకేమియు దోచుటలేదు.
శుక్రు: సరేకానిమ్ము. ఇంకను వేచి చూచెద. సాయంతనము రావచ్చుచున్నది. నేను స్నానమున కేగి వచ్చెద.

(నిష్క్రమింప)

దేవ: నిర్మలా! సాయంకాల మెప్పుడెప్పుడగునని వేచియుండ నిప్పుడది యాసన్నమయ్యె. ఇంక నామిత్రుడు కచుడు వచ్చుచున్నాడేమో చూచెద. (నిర్మల బయటకువచ్చి) ఆహా సూర్యుఁడస్తంగతుఁడగుచున్నాడు. నెచ్చెలీ ఈ యరుణరాగము జూడుము.

తే॥గీ॥ అస్తమించెడు సమయమునందు లోక
బాంధవుఁడు చూడు చెలియ! ప్రభాతమందు
బోలె నరుణరాగంబును బూనుచుండు
వార్ధకంబు రెండవ శైశవంబు గాదె!

నిర్మ: అవును. అదియునుంగాక.

తే|గీ|| మిత్రుఁ డాత్మనివాసంబు మెయి జరింప
బశ్చిమాంగన రాగసంపదవహించె:
మిత్రుఁ డాత్మనివాసంబు మెయి జరింప
రాగ మూననివా రిలలో గలారె?

దేవ: నిర్మలా! బాగుగావచించితివి. (విని) నిర్మలా! ఆ అంబారావం బులు హోమధేనువుల రాక దెల్పుచుండుటలేదా? నా చెవులకవి మంగళ వాద్యంబులుగా నున్నవి.

నిర్మ: వానితోడ గచుఁడుగూడ వచ్చియుండును.

దేవ: ఏడే? యింకను రాక నతఁడు తామసించు చున్నాడు.

నిర్మ: నెచ్చెలీ! త్వర పడకుము. నేబోయి చూచివచ్చెద. (లోనికేగి మరలవచ్చి) చెలీ! నేడేమొ కచుఁడాలతో రాలేదట.

దేవ: అక్కటా! నే డేమి విపరీతము. నిర్మలా! నాకు నియ్యది వింతగా నున్నది.

ఆ|వె|| అనుదినంబు భానుడస్తమింపకమున్నె
ఆలతోడ నింటికరుగు మిత్రు
డాలు వచ్చిన నిను డస్తమించిన నిట్లు
తామసించు నేడిదేమి కతమొ?

దేవ: నెచ్చెలీ నామదికి గచునకశుభ మేదో కలిగినట్లు తోచుచున్నది.

నిర్మ: మరలబోయి చూచివచ్చెద. అయిన కచుడు వచ్చిన నీదండకు రాక తామసించునా? (పోయి చూచివచ్చును)

దేవ: నిర్మలా! రాలేదా? అయ్యో! కచు డేమయ్యెనో గదా?

నిర్మ: ఏమైన నీకు భయమేల? నీతండ్రితో జెప్పెద మతడాతని రప్పించును. * గీతము

దేవ: అవునే రమ్ము. (లోని కేగి) తండ్రీ... తండ్రీ. (శుక్రుడు రా)

ఉ॥ వాడి మయూఖముల్గలుగువాఁడపరాంబుధి గ్రుంకె, ధేనువుల్
నేఁడిటవచ్చె నేకతమ నిష్టమెయిన్ భవదగ్నిహోత్రముల్
ప్రోడిగ వ్రేల్వగాబడియె ప్రొద్దునుబోయె గచుండునింతకున్
రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగబాధ నొందెనో?

శుక్రు: కచుఁడింకను రాలేదా? మార్గమున మసలెనేమొ? దానికింత చింతయేల?

దేవ: తండ్రీ! ఎన్నఁడే నాతఁడిట్లు మసలెనా? ఈదిన మతనికేదో విపత్తు సంభవించినది. తమదివ్య దృష్టిని దాని యుక్కువం బెఱిగి వాని రక్షించి నాకు మిత్రదాన మొనర్పవలయును.

శుక్రు: అమ్మాయీ! నీచింత మానుము. నీయభీష్ట మీడేర్చెద.

చం॥ దిగులును వీడుమమ్మ భవదీయహితుండు మృగామరారిప
న్నగముల బారి జిక్కిన వినాశమునుం గనియున్న నింక నె
ట్టిగతిని బొందియున్నను దుర్గతిన్ నిజముంగని వాని వేగిర
మ్ముగ్మ భవదీయసన్నిధికి ముందటి రీతిని దేరబంచెదన్

(మంత్రము పఠించి జలములు నెత్తి) మృతసంజీవనీ విద్యా! నీవు కచుఁడెక్కడ నేస్థితిలో నున్నను వానిని సురక్షితముగా నెప్పటి యట్లు తోడ్కొనిరమ్ము. (జలములవిడువ కచుండరుదెంచి గురువునకు నమస్కరించును)

శుక్రు: (ఆశీర్వదించి దేవయానివంకదిరిగి) పుత్రీ! ఇదుగో నీ మిత్రుడు. సంతసమాయెనా?

దేవ: తండ్రీ! నా సంతసమునకు మేరయేలేదు. మిత్రా! కచా! నేఁడీ యాలస్యమునకు గారణమేమి? నీకేమైనావిపత్తు సంభవించెనా?

కచు: సోదరీ! అందులకు సందియమా? లేకున్న నేనేమి? యింటికేగుటకు మసలుటేమి?

చం॥ గురువరునాజ్ఞ నీదినము గోగణముం గొనిపోయి కానలం

దిరిగి కుశాదులంగొని జనించిన శ్రాంతిని దీర్పఁగా నట
ద్రుమరచిత ఛాయ నిల్వ నసురుల్ జని నేఁగచుడం చెరింగి సం
హరణమొనర్చి రందనుక మాత్రమె నే నెరుగంగఁ జాలితిన్.

తదనంతర మేమయ్యెనోగాని క్షేమముగా మాత్రము నీయనుగ్రహామునను, గురువర్య ప్రసాదంబునను నిందు విచ్చేసితిని.

దేవ: కచా! నీవు భద్రముగా తిరిగివచ్చుట మా కానంద మయ్యె. నీపై రాక్షసులు పగఁబూనియున్నారు. ఇకెన్నడు నడవి కేగవలదు ఆశ్రమముననే నిల్వుము.

శుక్రు: కచా! అట్లే యొనర్పుము. ఇఁక పూజవేళయైనది రమ్ము.

(యవనిక పడును)



## సప్తమరంగము

### స్థలకము-వృషపర్వుని నగరు

వృషపర్వుఁడు పాడుచుండ, నికుంభ, కుంభ, దండులు పజ్జన నిలిచి యుందురు. * గీతము

వృష: నికుంభా! నీవు తెచ్చిన శుభవార్తకెంతయు సంతసమయ్యె. ఇదిగో! పారితోషికముగా నీ రత్నహారముం గైకొమ్ము. (అం దిచ్చి) నీయనుచరులకు వేయినిష్కము లిప్పింపుము. సురజయం బు పిదపనిట్టి సంతోషవార్త వినలేను. ఏదీ సుర తెమ్ము. (దండు డు సురనియ్య ద్రాగుచుండ శర్మిష్ట ప్రవేశించి తండ్రికి నమస్కరింప దీవించును.)

శర్మి: తండ్రీ! నేఁడీ యసాధ్య కోలాహలంబునకు గారణంబేమి?
వృష: అమ్మాయీ! నీవింకను వినలేదా? ఇటు కూర్చుండుము.
(కూర్చుండ)

చం॥ అసురులఁ గెల్వఁగాఁ దగుఁ గళాదుల నభ్యసనం బొనర్పఁగా
నసురుల యొజ్జయొద్దకు సురాధిపు పంపున వచ్చినట్టి ధా
త్రిసురుఁబట్టి కానల వధించినవార్త ను విన్నయంత నా
వ్యసనముదీరి సంతసము పైకొనుచున్నది కూర్మిపట్టిరో!

శర్మి: తండ్రీ! కచుడు హతుడయ్యెనా?
వృష: అవును. వీరి యప్రమత్తత వలన యట్టిది సమకూరె?
శర్మి: నికుంభా! మీరొనర్చిన యుపకారము మే మెన్నటికిని మరువను.
తండ్రీ! నాకును నీవార్త కడుంగడు ముదావహమయ్యె.

ఉ॥ బోఁటికి దేవయాని ననుబోఁటుల నా కచు రాకఁగోలె, నె
ప్పాటను దండఁ జేర్పదని పంగుచుండఁ గచుండు నీలెనాన్
నేటిదినంబుగోలెఁ జెలి నెయ్యము తియ్యమిరాఁ దొంటియ
ట్లాటలఁ గూడియాడ ననువయ్యెనటం చెద సంతసించెదన్.

వృష: అమ్మాయీ! నీకు సంతసమగుటయే నాకు గావలసినది. నికుం
భా! సుర నిటు తెమ్ము (తెచ్చియివ్వ త్రాగుచుండఁ భాండాయ
నుడు వచ్చి నమస్కరించి)
భాండా: రాజేంద్రా! నా సహాధ్యాయి. కచుడు... కచుడు...
వృష: ఏమిరా కచుని సమాచారము? గురువర్యుండు కచు డింటికింక
ను రాలేదని నన్ను వెదికింపుమని నీచేఁ జెప్పి పంపెనా?
భాండా: కాదు కాదు. కచుఁడు క్షేమముగ నున్నాడు. క్షణముక్రింద
టఁ గనులార వానిఁ జూచితి.
వృష: (లేచి) ఏమేమీ? కచుడు భద్రముగా నున్నాడా? (నికుంభా
దులవంక తిరిగి)

ఉ ॥ దేవతలంపనిందుఁ జనుదెంచి గురూత్తముదండఁ జేరి, సం
జీవని విద్యనేర్వఁ గృషిస ల్పుచునుండు గురుపుత్రుఁ డో
రీ! వికటాత్ములార! యెసరేమియులేక ధరిత్రియందు,ని
ర్జీవితుఁ జేసినారమని చెప్పఁ గ నాకడ సాహసింతురే?

(కత్తి నిదూసి) ఈ మృషోక్తులాడి నంకులకు మీనాలుక త్రిల్చి
మిమ్ము కండ కండలుగఁ జీల్చెదఁ జూడుడు.

నికుం: (వణుకుచు) దేవా! మేము మీ కోపమున కెంతవారము.
మేము నిక్కముగా నాతని జంపితిమి.

భాండా: దేవా వారిపై గోపమూనకుము. వారే పాపమెరుంగరు.
కచుండు మరణించినను, వానిని గురువరేణ్యుడు దేవయాని ప్రేర
ణంబున బునర్జీవితుం జేసె. నేనీవార్త మీకెరింగింప వచ్చితిని.

వృష: అక్కటా ఈ దేవయాని మన మనోరథముల భగ్నమొనర్పు
చున్నది. ఇక మనమెట్లా కచాధముని జంప గలము? ఎంత జంపి
నను గురుండు మృతసంజీవనీవిద్యచే బ్రతికించు చుండును గదా?

శర్మి: తండ్రీ! అధైర్యపడకుఁడు. మీరు చేయగలిగిన దొనర్పుఁడు.
తర్వాత జూతము.

వృష: నికుంభా: నీవీ యనుచరులతో నేగి, యప్రమత్తులై, కచుని
బట్టి, తుత్తునియలుగా నొనర్చి సముద్రమున బడవైచుఁడు.

(నిష్క్రమించును)

(అనుచరులు నమస్కరించుచుండ యవనిక వ్రాలును)

*

# అమరానందము

అను

# కచ - దేవయాని

## తృతీయాంకము

= ప్రథమ రంగము =

స్థలకము — వృషపర్వుని కొలువుకూటము.

(వృషపర్వుఁ డాలోచనానిమగ్న హృదయుఁడై ఇటునటు తిరుగుచు)

వృష: ఎంతకాల మాలోచించినను ఎన్ని భంగుల యోచించినను నాకుఁ గర్తవ్య మొకింతయేని స్ఫురించుటలేదు. ఆ కచాధము నెట్లుక్కడుప నగునో తెలియరాకున్నది. నా యనుచరులు వారి కీ జేతనైన నన్నెల్ల పాటుపడియు నీ విషయమున భగ్న మనోరథులై చేయునదిలేక యూరకున్నారు. నాకును మార్గము గోచరమగుట లేదు.

ఉ॥ ఎంచగరాని క్రోధమువహించి గురూద్భవు నొక్కసారి ఖ్రమం
దించి వటద్రుమూలమున నించిరి; క్రమ్మఱ నొక్కసారి ఖం
డించి సముద్రమధ్యమున డించిరి; నా పరిచారులైన జీ
వించియె యున్నవాఁ డితఁడు వీని నిఁకేవిధిఁ జంపువాఁడనో.

ఈ విషయ మాలోచించుచు నిద్రహారంబులు లేక పరితపించుచున్నాఁడ. ఎన్ని సార్లతని జంపినను, గురుమంత్రమాహాత్మ్యంబు

న గ్రమ్మఱం బ్రతుకుచున్నాఁడు గురువర్యునొద్ద మృతసంజీవనీ విద్య యుండుదాక నతఁడు మాకు జెనక దుర్లభుఁడై యున్నాఁడు. ఈతఁడు మృతి నొందినగాని మాకు మనఃస్వాస్థ్య మంబరకుసుమ సదృశంబై కన్పట్టుచున్నది. ఇప్పుఁడేమి సేయుదును? మఱల నీ కచుని జంపింతునా? అక్కటా దానివలన బ్రయోజన మేమి? గురువర్యునకు మాపై గోప మధికమగుటయేగాక వేరు లాభ ముండునా? అతఁడు మరల దేవయాని ప్రేరణంబున గురువర్యుని మంత్రబలంబున బ్రతికిరాఁడా? ముందు దేవయానినే జంపుదునా? అక్కటా అదియు నిరర్థకమగుటయేగాక మాకు గురుశాపంబు గూడ నాపాదింపఁగలదు. ఇఁక గురువర్యునే సంహరింతునా? ఛీ ఛీ! ఏమి నా వెఱ్ఱితలంపులు. దానివలన గురుహత్యయు బ్రహ్మహత్యాపాతకంబులు దలపైకి దెచ్చుకొనుటయే. మృతసం జీవనీవిద్యాలాభమును నసురులకు బోఁగొట్టి మొదలునకే మోసము దెచ్చుకొనుటగాదా? ఏదియును బాలుఁబోవకయున్నది. నారకుఁడైన గాకున్నాఁడే. ఏమిచేయుదును? ఏదియో యొక విధి యొనర్చినగాని నాహృదయాందోళన ముపశమింపదు. మరల యోచించెదగాక. (కూర్చుండి యాలోచించుచుండ శర్మిష్ఠ ప్రవేశించును)

శర్మి: తండ్రీ! నమస్కారము.

వృష: కల్యాణమస్తు. అమ్మాయీ! ఏల ఇటుల వచ్చితివి?

శర్మి: ఏమియు ప్రొద్దుపోనందున వచ్చితి తండ్రీ! మీ రేదియో దీర్ఘాలోచన పరులయి యున్నట్లున్నది. దీనికికారణ మేమి?

వృష: తనయా! రాజులకు జింతలకు కరువా? వాని గోల నీకేల?

తే॥గీ॥ రాజ్యభారంబు మోసెడి రాజవరుల
కాత్మజా! చింతలుండుట యరిదియగునె?
కాన నాకును దుఃఖంబు గలిగె సౌఖ్య

రహితమేకాని సుఖదమే రాజపదవి?

శర్మి: తండ్రీ! ఇట్లు మీరు పులిమిపుచ్చిన నేను మిమ్ము విడుచుదానా? ప్రస్తుతము మీ చింతాహేతువేదియో నుడివిన నయ్యది నాచేనయిన నపనయించెద. చెప్పినమీకు నష్టమేమి?

వృష: ఆత్మజా! నీ మూర్ఖపుపట్టుదల వదలవా? వినుము. మేమా కచాధముని యంతమొనర్పఁ జేసిన యత్నంబుల నీవెరుంగుదువు కదా? తత్ఫలంబును గురించియే నేనిపుడు చింతించుచున్నది.

మ॥ అతనిం జంపినదాఁక మాకెవరికావంతైన డెందాన ని
ర్వృతి సేకూరదటంచు నెంచి యతనిన్వేమారు చంపించినన్,
మృతసంజీవనిచేత భార్గవుఁడు నెంతే ప్రేమతో నాతనిన్
బ్రతికింపన్, గరణీయముల్ గనక సంతాపింతునో యాత్మజా!

శర్మి: తండ్రీ! మన యాచార్యుండే మన కార్యభంగమొనర్ప నింకేమి సేయగలము.

వృష: అమ్మాయీ! మా ప్రజ్ఞయంతయు రణరంగమునగాని యాలోచన యందునగాదు. నీవేమయినా యోజించి కర్తవ్యమును నుడువుము. (నారదునిపాట వినబడును) అడుగో నారదుండు వచ్చుచున్నాడు. * గీతము

(వృషపర్వ శర్మిష్ఠలు నారదునకెదురేగి నమస్కరించి యాశీర్వదింపబడి లోనికి తోడ్తెచ్చి యుచితాసనాశీనుం జేసిన)

నార: వృషపర్వా! నీ సుఖలక్షణముల విలోకింప మనోరథసిద్ధి చేకూరినట్టు లేదే?

వృష: దేవా! మీరు యథార్థముగ నాహృదయాందోళనము గ్రహించితిరి.

నార: అందులకు గారణమేమి? ప్రయత్నలోపమా? అదృష్టలోపమా?

వృష: అదృష్టలోపమే యైనది.

చం॥ దితిసుతవైరి దూత యని దేవర తెల్పినయంత నా కచున్
మృతునిగఁ జేతునేని, ననిమేషుల కార్యము భంగమౌనటం
చతనిని రెండుసార్లు నికటాటవిఁ బట్టివధింపఁ జేసినన్
బ్రతికియెయున్నవాఁ డతఁడు భార్గవుసత్కృపచేత నారదా!

శర్మి: ఇందువలన మాకేమియు దోఁపక మురపిల్లుచున్నారము.

ఉ॥ ఊరలు పక్షపాత మొకయించుకలేక సురా మరాదులన్
గౌరవమారఁ జూచి, యనుకంపను బ్రోచెడు వారలంచు మీ
పేరు దిగంతముల్బరవ వింటివిధాతృ తనూజ! యల్లె మా
కారడిఁ గూడఁజేయు కచు నంత మొనర్చు పథంబు తెల్పుఁడీ

వృష: మునీంద్రా! నాప్రార్థనంబు నదియు. నీవే మా కుపాయాంతరము జూపి కడతేర్ప వలయును.

నార: ఇదేనా? వృషపర్వా! నేనును నీవిషయముంగూర్చి యోజించితి. ఒక విధముగా దానికి దగిన పన్నాగముఁ బన్నితి. అయిన మీ రొనర్చిన ప్రయత్నముల నెరిగింపుఁడు. మొదటిసారి మీరాకచు నెట్లుచంపితిరి?

వృష: అతఁ డరణ్యమున గోగణంబుల గాచుచు విశ్రమించియుండ నాతని మనవారు భల్లములతో బొడిచిచంపి యొక వటవృక్షమునను బంధించివచ్చిరి.

నార: అత డాబంధముల దెంపుకొనివచ్చెనా?

వృష: సునాయాసముగా దెంపుకొన గలిగెనట.

నార: రెండవసారి యెట్లాతని నిర్జించితిరి.?

వృష: అతఁడు దేవయానిచేఁ బంపబడి పుష్పాపచయ మొనర్చుచుండ నాతనిబట్టి మనవారుఖండించి. ఖండముల సముద్రమధ్యమున

బొబ్బ వైచిరి.

నార: అప్పుడుగూడ సజీవుడై వచ్చెగదా?

వృష: అక్కటా! అట్టె పునర్జీవితుడై చెక్కు చెదరక వచ్చెనట.

నార: సరే! మనమా కచుని దేహమునుగాని, దేహ ఖండములుగాని నెందు వేసినను విద్యాప్రభావంబున నా భార్గవుండు కచుని పునర్జీతునిఁ జేయు. కావున మనము నానిని భార్గవునకు, కచుని బ్రతికించిన నాపదగలుగు స్థలమునందుంచవలయును.

వృష: సరేకాని యట్టిస్థల మేది?

నార: దానిని గనుగొనలేవా? అతనికుక్షియే. ఇఁక నిట్లొనర్పుము.

చం॥ మఱియొకసారి యా కచుని మారణంబొనరించి తత్కళే
బరమును బూదిసేసి, యది వారుణితోడుతఁ గల్పి, శుక్రుని
త్రాఁగఁ బిలిపించి విందునకు దానిని భార్గవుఁ ద్రాగనిండు, దే
వర హృదయేప్సితంబు ఫలవంతముగా సమకూరు దీనిచేన్.

వృష: భళీ! మునీంద్రా! నీ శేముషీవిభవంబు నిరుపమానంబు.

నార: వృషపర్వా! నీమెప్పున కేమిగాని, మీరు నే వచించిన విధంబొర్పుఁడు. భార్గవుఁడాతని మృతసంజీవనిచేఁ బ్రదికించిన తనకు మరణమగునని బ్రదికింపఁడు. అంత కచుండంతమొందు. సురలకానందము డిందు.

వృష: దేవా! అట్టే యొనర్చెదము.

నార: వృషపర్వా! నేనింక నాకలోకమునకేగెదను. నేనుడివినట్లొనర్చి మనోరథ మీడేర్చుకొనుము.

(వృషపర్వుఁడు శర్మిష్ఠయు నమస్కరింతురు. నారదుఁడు పాటపాడుచు నిష్క్రమించును.) * గీతము

శర్మి: జనకా! ఇఁక నికుంభుని బిలిపించి నారదమునీంద్రుడు నుడివినట్లొనర్ప యాజ్ఞాపింపుఁడు.

వృష: అట్లే వెయినర్చెదగాని, కచుడిప్పుడు శుక్రునాశ్రమము విడిచి వచ్చుటలేదు. అతఁడు మనచేత జిక్కుటెట్లు?

శర్మి: తండ్రీ! అదెంతపని? వీరారు నేఁడే శుక్రాచార్యు రేపటి విందున కాహ్వానింపుఁడు. కాదు. నేను పోయి మీరాకుమారునిగా నాహ్వానించెద. మిగతవిషయాలు నాకు విడువుఁడు. నికుంభునిమాత్రము నాదండ కంపుఁడు.

వృష: అట్లేకానిమ్ము నికుంభా!

(నికుంభుఁడు ప్రవేశించి నమస్కరించును.)

వృష: నా తనయ నీకేదో తెలుప దలిపించినది. ఆమెయాజ్ఞ యేనాయానతిగా దలంచి యప్రమత్తుడవైన యనుచరులతో మెలంగుము.

నికుం: మహాప్రసాదము.

( యవనికపడును. )

*

ద్వితీయరంగము

స్థలకము — ఉద్యానవనము.

( దేవయాని కూర్చుండియుండును )

* గీతము

దేవ: అకటా! ఏమి నాభ్రాంతి? నాకు లోకమంతయుఁ గచమయంబుగా గన్పించు చున్నది.

మ॥ కనులన్ మూసిన విప్పినన్ బ్రియుని యాకారంబె కన్పట్టు వీ
కను శ్రోత్రంబుల మూసినన్ దెరచినన్ గాంతోక్తులే తోచుబు

ద్ధినటుల్ త్రిప్పినఁ ద్రిప్పుకున్న కచునందే సక్తమై యుండు హా
మనసున్ బందిగఁ జేయసాధ్య మగునా మారార్తచిత్తాళికిన్?

అకటా! ఇటులుండియు నాతడు నాదండ నుండునప్పుడు నాతనితో మాట్లాడుటకుగాని, కనులెత్తి చూచుటకుఁ గాని సామర్థ్యంబు దక్కియుండును.

చం॥ అతడెడ నుండునప్పు డిసుమంతయు నెమ్మది పెల్లివచ్చు నీ
ప్సితములఁ దెల్పనేరక విచేష్టతఁబూని వియోగమంది యి
వ్వితమున తారుమారయి తపించుచు నంగుచుండు నక్కటా
గతజల సేతుబంధములు గావొకో కాముకకోటి యోజనల్?

ఆర్యులు కాముకులు. భావనాశూరులే కాని కార్యశూరులు కాదందురు. ఈయది నాయెడ నిక్కమంబయ్యె. బ్రహ్మచర్యవ్రతము నవలంబించి యున్నవాడని కచునితో బహిరంగంబుగా నా మోహముఁ దెలుపక గూఢముగ నాప్రవర్తనచేత దెలిపినను నాతండు నాహృదయ మెఱుంగనట్లు నటించుచున్నాడు. ఈనటన యజ్ఞానజనితమో, వైరాగ్యజనితమో తెలియరాకున్నది. ఏదికారణమైనను దిన దినాభివృద్ధి గనుచున్న యీ మారుని హాళాహళికిఁ దాళలేకున్నదానను.

(దేవయాని దుఃఖించుచుండ నిర్మల ప్రవేశించును)

నిర్మ: నెచ్చెలీ! ఇదేమి?

చం। కువలయనేత్రి! నీకు కనుగొల్కుల నుండి యజస్రమశ్రుబిం
దువు లెడలేక చిప్పిల నధోముఖవై పలవింప నేమి హే
తువొ చెపుమా త్వదీయముఖతోయజమందు మందహాసముల్
దవులఁగఁ జేతు లేనియెడల న్నను దబ్బరయంచు బిల్వుమా?

దేవ: (కన్నులు తుడుచుకొని) నెచ్చెలీ! యేమియు లేదు. భయపడకుము.

నిర్మ: దేవయానీ! ఎవరికో చెప్పినట్లు నాకు చెప్పెదవేల? నేను నీ శ్రేయస్కామిని గానా? ఇదివర కీవు నాకడ నెట్టి రహస్యమైనను జెప్పెదనని యొట్టిడలేదా? నీ వెంతదాచినను, దానిచేత పూవు తావివలె, నీ చర్యచేత నీ గుట్టు రట్టగుచుండలేదా? అట్టిచో నీ మాట నమ్ముటెట్లు?

ఆ॥ వె॥ వాసలేని వరద వహ్ని లేని పొగయు
బురుగులేని చీడపుట్టినట్లు
కారణంబులేని గాసి గల్గెనటన్న
నమ్మువార లెవరె యెమ్మెలాడి!

తే॥ గీ॥ హృదయనేపథ్యమునునుండి వదననాట్య
రంగమున నాత్మసూత్రధార ప్రయుక్త
భావ నట కాభినయములు బయలుపరచు
వార్త మృషయన నమ్మెడువార లెవరు?

నానోట నువ్వుగింజ నానదని మాట్లాడ వెనుదీయకుము.

దేవ: నిర్మలా! నాయవస్థ యేమని చెప్పగలను. వచించుటకు నాకెంత యు సిగ్గగుచున్నది.

నిర్మ: బేలా! నీకు దలవంపులేల? అవిగో ఆ కమలములం జూడుము.

కం॥ మొలబంటి పంకమందును
దలబంటుల యంబులందు దామరసంబుల్
దల లెత్తి వెలయుచుండగ
దలవంపులు నీకునేల? తామరసాక్షీ!

ఇకనైన మారాడక చెప్పుము.

దేవ: నెచ్చెలీ నీవెంతచెప్పినను నాకు నోరాడకున్నది.

నిర్మ: పోనిమ్ము. నన్ను జెప్పుమనెదవా? నీకు త్రిలోకసుందరుండగు

బృహస్పతినందనునిపై మోహముజనించి యున్నది. నిక్కమే నా? (దేవయాని తలవంచి యూరకుండ)

దీని కేల చింతించెదవు. అతడు నీవాడే కదా? ఈ వ్రతనియమాంతమున నిన్ను బెండ్లియాడి, నీవొనర్చిన యుపకారంబునకు గృతజ్ఞతెఁ జూపకుండునా?

దేవ: నెచ్చెలీ! నీ వాడునది నిక్కమగునా?

నిర్మ: నిక్కము కాకేమి? నీవు సంపూర్ణ యౌవనవతివి. అతఁడు తరుణవయస్కుఁడు. వాఁడునీయింట, బందికాక తప్పించుకొనిపో గలఁడా? నీ సురూపసంపద ప్రతిభ నీ వెరుంగకున్నావు.

దేవ: ఏమో? నేనేమి పల్కినను, యేమి చేసినను, నాతఁడు స్థాణువుంబోలె నేమియు నేర నట్లూరకుండు.

నిర్మ: గోలా! ఆతడు ఛాందసుఁడుగదా?

మ॥ ప్రమదారత్నమ! నీ ఛలోక్తులను నీ ప్రాగల్భ్యసంరంభమాయమ రాచార్య సుతుండుయుక్తమగు వ్యాఖ్యానంబుగా వించిమోహమటంచున్ దెలియంగ నేరడనుచున్ స్వాంతంబునన్ నీక ధైర్య మిదేలా? వనజేక్షణా! స్మర విచారాంధుల్ గదా ఛాందసుల్

దేవ: నిర్మలా! అదే శర్మిష్ఠవచ్చుచున్నది. యీ ప్రశంస విదలుము.

నిర్మ: నెచ్చెలీ! చెప్పమరచితిని. శర్మిష్ఠ రేపు సురాపాన మహోత్సవంబని మీతండ్రిని బిలువవచ్చి నీతో తనరాక దెల్పుటకు నన్ను బుత్తెంచె.

దేవ: (శర్మిష్ఠ ప్రవేశింప) శర్మిష్ఠా! నేడేమి? త్రోవతప్పి వచ్చినట్లున్నది

శర్మి: నెచ్చెలీ త్రోవఁ జూచుకొనియే వచ్చితిని.

నిర్మ: అయిన నిన్నిదినంబులు రాక యుంటివేల?

శర్మ: కారణము నన్నడుగవలయునా? రాక్షసులు, మీహితుని గచుని దునుమాడ ప్రయత్నించియుండ. నే నేమొగముతో మీకడ

కు రాఁగలను? నే డెట్లైన మిమ్ము గాంచవలయును. గురువర్యు
వింకున కహ్వానించు మిషచే నిట్లువచ్చితిని.

దేవ: శర్మిష్ఠా! మీరిప్పటికైన, గమకుఁడు మాతండ్రి దాఁడనుండువరకు
నచ్యుతుండని యెఱింగితిరా?

శర్మి: నెచ్చెలీ! వారెఱింగియే అట్టిప్రశ్నముసుండి విరమించిరి. నేను
నుఁ జక్కఁగా బోధించితిని. ఇక నావిషయమున నీవు శంకవదలు
ము. ఆవార్త నీకుదెలుపుటకే నేనిందు వచ్చితిని.

దేవ: సంతసమయ్యె? మీతండ్రి నీకు సమరభూమినుండి యేమి బహు
మతులు తెచ్చెను?

శర్మి: రాభాగల నగలను వలిచి తెచ్చెను. ఇవిగో! ఆనగల కేమిగాని
యీపుష్పములఁ జూచితివా?

దేవ: (శర్మిష్ఠపుష్పము లొసంగజూచి) ఆహా! కోమలమ్మై, మనోహ
ర గంధిలంబై, నిరుపమాన కోమలంబై, కాంతి వంతంబులై నల
రారు పుష్పములుగూడ దేవలోకము లోనివేనా?

శర్మి: కాను. కాదు. ఈ పాంతమునగల కాంతారముననే గలవు.
అయ్యవి యీపురమున కీశాన్య దిశయందున్నవి. మాతండ్రి వీనిని
దెప్పించి యిచ్చెను.

దేవ: అటులైన, నేనును దెప్పించుకొనఁ ఁయెద? నిర్మలా! రాక్షసభయ
మిక లేదుగాన కచుని సంపెదను.

నిర్మ: నీ యిష్టము వచ్చినట్లొనర్పుము.

శర్మి: నీ కనుసన్నల మెలఁగు కచుఁడు నీ దండనుండ నీ కిట్టి పుష్పము
లు దొరుకుట కష్టమా? వీనిని మచ్చునకుంచుకొనుము.

కం ॥ నీ కనుసన్నల మెలఁగుచు
నా కచు డెందాకనుండు నందాఁక నీ
కీ కాననఁగల కుసుమా
నీకముక రగతములుగాదె నీరేజాక్షి॥

ప్రొద్దుపోయినది. ఇంక నే నింటికేగెద. (నిష్క్రమించుచు) (స్వగ)
నా పన్నుగడ ఫలించె. ఇంకఁ గచునకు మృత్యువు తప్పదు.
మా కానందము తప్పదు. అమరానందమునకు మారు అసురా
నంద మొదవుగాక. (నిష్క్రమించును)

నిర్మ: చెలీ! మనమును యాశ్రమమున కేగుదము రమ్ము.

దేవ: అట్లేపోవుదము రమ్ము. ఇట్టి పుష్పములఁ గచునిచే దెప్పించి,
మా కచుని పుష్పమాలాలంకృతుని యొనర్చి యానందించెద.
రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు)

*

## తృతీయరంగము.

### స్థలము—కాంతారము

(కచుఁడు పూలబుట్ట చేతబట్టి పూవులకొరకు వెదకుచుండును.)

కచు: ఆహా! ఈశాన్యమూల యంతయు వెదకి వేసారితినిగాని శర్మిష్ఠ
యిచ్చిన పుష్పముల బోలు పుష్పము లెందును గానరాకున్నవి.
నే నేమైన దిశవిషయమై పొరపడితినిఁ గాబోలు. కానిమ్ము. ఇతర
దిక్కులుగూడ వెదకెద. (అట్లొనర్చి) అక్కటా! యెందు గాంచ
జాలనైతిని. పుష్పములులేక నే నేమొగముతో దేవయానికడ
కేగుదును. ఏగిన నాసోదరి యెంత దుఃఖించునో? నాకు జూడ
నిది రాక్షసులు నన్ను మటుల జంపఁ బన్నిన పన్నాగమని తోచు
చున్నది. అగుఁగాక.

ఉ॥ ఆ వనజాక్షి నాయెడ దయామతి వీడకయుండుఁదాక సం

జీవని విద్య యొజ్జకు వశీకృతమై తనరారుదాక నా
జీవముగూర్చి యెట్టి వగ జెందననవశ్యము లేదుగాని, సం
జీవని విద్య నాకెటుల జేకురునోయని చింతయయ్యెడిన్.

నా తలిదండ్రులు, దేవతలు, దేవవిభుడు నేనెప్పుడెప్పుడు మృత సంజీవనీ విద్య నార్జించి వారి కుపకార మొనర్తునోయని యువ్విళ్ళూరుచున్నారు. ఈ కాలవిలంబనమునకు వారెంత పరితపించు చున్నారో? ఎన్ని దినములు గడచినను నాకు గర్తవ్యంబు గాన్పించుట లేదు. ఏమి యొనర్తుమన్నను నేదో యొక యవాంతరము స్ఫురించుచున్నది.

సీ॥ అడుగుదునా విద్య వశీ నేర్పుమని గురు
గలుపను పోమ్మన్న గార్యమెద్ది?
అడిగింతునా దేవయానిచే దానికి
నీకొనకున్న నింకేమి సేతు?
పోవుదునా విడిపోయిన నమరేశు
పంపు నే పైఖరి బాపువాడ?
నిలుతునా కొన్నాళ్ళు నిలిచిన మాత్రనే
కార్యంబు సేకూరు కరణి గలదె?

తే॥గీ॥ ఏవిధంబున జూచిన నిందు మైన
బాలుపోవక యుండు నేలీల నింక
దేవరిపు గురునుండి సంజీవనిగాని
నిర్గరానంద ముకుటా! నే నొనర్తు?

అకటా! ఇట్లధైర్యపడి యేమి ప్రయోజనము? కార్య భాగము నహించితి. ఏ విధమైన నది సాధించితీరెద. తర్వాత దైవానుగ్రహ మెట్లుండునో యట్లగుగాక. దేవా! భక్తత్రాణపరాయణా! నేను నీభక్తుడను. నేవచ్చిన కార్యము నీభక్తుల కానంద మొసంగు

నది. ఇంత కార్యమున నాకు దోడ్పడక దోషాచరులకే తోడ య్యెదవా? * (గీతము)

(పాడుచుండ నికుంభు డనుచరులతో ప్రవేశించి)

నికుం: ఓరీ! యనుచరులారా! అదుగో కచుడు. ఈసారి వీనిజంపుడు. అంతటితో మా శ్రమలన్నియు నివారణము కాగలవు. (రాక్షసులు పైబడి కచుడు అయ్యో! అయ్యో! అని నేలగూలును.) అను చరులారా! వీని శవము నిటు తెండు. దానిని గాల్చి భస్మమున కల్పి మన రాజుదగ్గరకు దీసికొని పోవుదము. (కచుని శవమును మోసికొనిపోవుదురు.) (యవనిక పడును)

*

## తురీయరంగము

స్థలకము — వృషపర్వుని మందిరము. సురాపానమహోత్సవము. వృషపర్వుడు, శుక్రుడు. రాక్షసులతో నర్ధచంద్రాకారముగ గూర్చుందురు. మధ్య సురాభాండము. నికుంభుడు గిన్నెలతో సుర నందియ్య త్రాగుచుందురు.

* (అందరు పాట పాడుదురు.)

శుక్రు: వృషపర్వా! ఎట్టి సుర సంపాదించితివోయి! దీని ప్రభావమేమి? ఇట్టిది నేనెన్నడు త్రాగలేదు.

తే॥గీ॥ బలములేనట్టివారికి బలమొసంగు
మాట నేరనివారికి మాట నేర్పు
దప్పిచే నుండువారికి దాహమార్పు
సురకు సరిసాటి గలదె యీ త్రిలోకియందు?

వృష: లేదు, లేదు. ముమ్మాటికిని లేదు.

కం॥ అమృతంబే పేయంబని
భ్రమపడి పల్కెదరుగాని పరికించినచో
నమృతంబీ మదిరముతో
సమమే తలక్రిందు తపము సలిపినయేనిన్?

నికుంభా! ఆచార్యవర్యునికింక నాల్గు గిన్నెలిమ్ము. ఆచార్యుండే విషయమునన్నైన శిష్యులకు దీసిపోవచ్చునా? (నికుంభుఁ డట్లిచ్చుచుఁ గచుని భస్మము గిన్నెలోఁగల సురలోఁ గలిపియిచ్చును.)

శుక్రు: (త్రాగి) శిష్యా! ఇఁక నేగెద. దేవయాని వేచి యుండును. (నిష్క్రమించును)

వృష: భళీ! మన యంత్రము జయప్రదమయ్యె. అసురులారా! ఇఁక మనకు భయములేదు— * (గీతము)

(తెర వాలును)



పంచమరంగము

స్థలము- శుక్రాచార్యునియాశ్రమము.

(దేవయాని యాసీనయై యుండ ప్రక్క నిర్మల నిలువబడియుండును)

నిర్మ: నెచ్చెలీ! సమాశ్వసిల్లుము. దైత్యులు కచుని చంపు యత్నములు చాలించిరని శర్మిష్ఠ వచింపలేదా? ఏ కారణముననో మార్గమధ్యమున తడవు మసలి యుండును. సత్వరము రాగలడు.

దేవ: నిర్మలా! నాకు శర్మిష్ఠ మాటలు మృషోక్తులని తోచుచున్నది.

నీవు మాటలఁ బోయి మార్గము నీకునవంకల నరసి రమ్ము. (నిర్మల నిష్క్రమించును) అక్కటా కుడిచి కూర్చుండ నేరక నేనేల నా తని వనికంపితిని?

ఉ॥ ఇక్కడ కేఁ గచ్చ : సురేశ్వరు పుత్రిక, వచ్చెఁ గాక నా
కన్కుసుమంబులేల కనులారగ జూపెను చూపెగాక నే
నక్కచు బోయి యిట్టి కుసుమంబుల దెమ్మన నేల? తెమ్మనన్
గ్రక్కున రాక యాతడటు కానల నేలకొ తానుసించుటల్?

నిర్మ: (ప్రవేశించి) దేవయాని! నాకనుచూపు మేర దూరమునకు చూచినను నెవ్వరును వచ్చుట లేదు.

దేవ: నిర్మలా! నీభ్రమయేగాని, కచుడెట్లువచ్చునే? అతఁడా ముష్కరదానవులఁ బారిఁ బడియుండును. లేకున్న నతఁడిట్లాలసించునా? ఇంకెక్కడి కచుండు? అతనికిని నాకును ఋణాను బంధములు తీరె. చేతులార చేసికొంటిని. ఇంక నెవరిని యేమనిన ప్రయోజనము?

* (గీతము)

నిర్మ: భీరు! ఒక వేళ నీవుభయపడునట్లు కచుఁడు దైత్యులచేఁ జిక్కిన ను నీ మాట త్రోసి వేయక పాటించునట్టి ని తండ్రియుండ, ఆతని దండ మృతసంజీవని విద్యయుండ నీకు భయమేల?

దేవ: నెచ్చెలీ! నాభయము నీ కేమి చెప్పగలను? నివు మాటలఁబోయి చూచిరమ్ము. (నిష్క్రమింప) అక్కటా! ప్రాణేశా రమ్ము. నీ మనోహారిణిని మన్నింపుము. కరుణింపుము..

ఉ॥ నమ్మెదవో మఱింతకును నమ్మవొ గ్రాతువో బ్రోవవో యధా
ర్థమ్ముగఁ బల్కెదాన త్వరితమ్ముగ నీ విటు లేగుదెంచి, న
న్నెమ్మెయి నైనఁ బ్రోతువను నిమ్మహి నాస రయొకింత నాకు జీ
వమ్ముల నిల్పియున్న దిటుపై నెటు సేసెదో జీవితేశ్వరా?

నిర్మ: (ప్రవేశించి) నెచ్చెలీ! నీ తండ్రిగారు వచ్చుచున్నారు.

దేవ: రమ్మాతని కెదురేగి యీ దుర్వార్త నెఱిగింతము. (యెదురేగి తండ్రికి నమస్కరించును. శుక్రుండు దేవయాని శిరము మూర్కొని, యామె విచారముం గని)

శుక్ర: పుత్రీ ఇదేమి? దుఃఖించుచున్నావు?

దేవ: తండ్రీ యేమి చెప్పుదును? కచుని ప్రాతఃకాలమున కొన్ని పుష్పములం దెమ్మని కాననకంపితి. అతం డింతవరకు రాలేదు. అతండు దుర్మరణము పాలయ్యెనో, లేక రక్కసులాతని యెట్టిహత్య కొనర్చిరో తెలియఁజాలకుంటిని. అతని గతి దివ్యదృష్టిచేఁ గనుగొని బ్రతికించి పుణ్యము గట్టుకొనుము.

శుక్ర: పుత్రీ! మఱలఁ గచుఁడు దైత్యులచే జిక్కెనా? పోనిమ్ము. వానికై వగఁజెందకుము.

కం॥ వగపక సంజీవని పెం
పగణిత గర్వమున నసురులా కచుతోడం
బగగొని చంపెద రాతఁడు
సుగతికిఁ జనుగాక యేల శోకింపంగన్.

దేవయాని! నీదుఃఖము మానుము. నీబోటి మహనీయ చరిత్ర కచుం బోలు కేవలమర్త్యునకై విలపింపదగదు. నీవు బ్రహ్మచేతను బ్రాహ్మణుల చేతను, సురాసురుల చేతను, సమస్త దేవతాగణము చేతను పూజింపఁ బడుచుండుట లేదా? ఆకచుని సజీవునిగా నుంచుట దుర్లభము. ఎన్ని మార్లు బ్రతికించినను, వాతఁడు మగలమరల హతుఁ డగుచున్నాఁడు. ఖేదపడకుము.

దేవ: జనకా! అయ్యది నాకు సులభమగునా?

మ॥ మతిలోకోత్తరుఁ డైన యాంగిరసు మన్మం డాశ్రితుండా బృహ
స్పతికిం బుత్రుఁడు, మీకు శిష్యుఁడు, సుమహా బ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజ వ్యాపాదితుం డైన, న

చ్యుత ధర్మజ్ఞ! మహాత్మ! యా కచునికే శోకింప కెట్లుండుదున్

మీరింక మాటాడక కచుని సజీవుని జేయుడు. అతడు నాకు ప్రాణతుల్యుడు. అత డిందు రానిచో నే నతడు పోయిన త్రోవనే పోయెదను. అతడు లేనిదే నేనిక జీవింప జాలను.

శుక్రు: పుత్రీ! అట్లే యగుగాక. (మంత్రంబు పఠించి జలంబు వదల శుక్రాచార్యు కడుపు వృద్ధియగును) కచా! కచా! (కడుపులోనుండి "ఊ ఊ" యను శబ్దమువిని కడుపు జూచుకొని) ఆహా! ఇదేమి వింత? కచా! నాకడుపు లోనికి నీ వెట్లువచ్చితివి? (చెవియొగ్గి విని) ఏమీ! అసురులు నిన్ను జంపి, కాల్చి బూదిచేసి యా భస్మంబును సురతో గలిపి యిచ్చిరా? అక్కటా! ఎంత మోసమయ్యె! సురాపానోన్మత్తుండనై యిట్టి పాపంబునకు లోనైతి. పెక్కు జన్మంబుల బుణ్యకర్మ లొనర్చి యార్జించిన యెఱుక క్షణమాత్రమున జెఱుచు మద్యసేవ చేయనగునా? ఇంకెవరును సురాపానం బొనర్పకుండు— (జలంబు పట్టి)

కం॥ భూసురులాదిగఁ గల జను
లీసుర సేవించిరేని, నిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు
చేసితి మర్యాద దీని జేకొనుఁడు జనుల్.

దేవ: తండ్రీ! అట్లే యగుగాక! ఇఁక గచుని బయటకు రప్పింపుఁడు. (జలముల వదలును.)

శుక్రు: అమ్మాయీ! నీ హితుడు నా కుక్షి భేదనం బొనర్చిన గాని బయటరాలేఁడు. అట్టిచో నేను బ్రతుకను. బయటకు రానీయ కట్లే యుంచిన గచుడు బ్రతుకడు. ఇందేది కోరెదవో చెప్పుము.

దేవ: తండ్రీ! ఇట్టి విషమ ప్రశ్నల కేమని ప్రత్యుత్తరం బీయగలను? ఈ రెండు విధములు నన్నగ్ని వలె దహించును. మీ యిరువుర

మరణంబులును సమాన శోక కారణంబు. కచుని మరణము నా
కమంగళము. తమరులేని యీ జీవములు దుర్భరంబులు. కావున
నుభయులును బ్రతికియుండు నెటు లన్వేషింపుడు.

శుక్రు: అమ్మాయీ! అట్టి యుపాయ మెద్దియైన గలదేని దెల్పుము

దేవ: (ఆలోచించి) తండ్రీ! కచునకు మృతసంజీవనీ విద్య నేర్పుడు
అతఁడు మీ కుక్షినుండి బయటకు వచ్చి మిమ్ము పునర్జీవితుం
జేయును.

శుక్రు: పుత్రీ! నేను మృతసంజీవనీ విద్య నెట్లాతనికి నేర్పుదును?

దేవ: తండ్రీ! పాత్రుండని యీ కచుని కన్నివిద్యలు నేర్పితిరి? ఇక నిది
యొక్కటే కొఱఁతయైయున్నది. విద్య నేర్చుకొనిన ఫల మితరులకు
నేర్పుటఁగదా కలుగును. మీకిట్టి పాత్రుఁడగు శిష్యుఁడెందు మరల
లభించును?

శుక్రు: అమ్మాయీ! ఇతనికి నేర్పిన నసురులకు శ్రేయస్కరమా?

దేవ: తండ్రీ! ఆ యసురాత్ములు దుర్మదాంధులుగదా! మిమ్మీ యవస్థ
కు దెచ్చిరి. మీ మాట నమ్మి వారుండకున్న మీ విద్య మీ
కడనే యుండెడిది. అట్లుండక మీకు విరోధులవలె బ్రవర్తించిరి
వారిపై మీ కింకను దయయేల?

నిర్మ: దేవా! కచుని బ్రతికింపకున్న మీకు బ్రహ్మహత్యాదోషము
వాటిల్లదా? ఆ పాతకంబు సురేంద్రాదుల కైన దుర్భరంబు.
మీరుదాని కొనిగట్టుకురా? మరియు రాక్షసులు మదాంధులై
మీ శిష్యు జంపి, మీ కబ్రాహ్మణత్వంబు గల్పింప సాహసించిరి.
ఇట్టి దుష్ప్రవర్తనకు మీరు గురుసుతునకు మృతసంజీవని నేర్పుట
యే తగిన దండనము.

దేవ: తండ్రీ! ఈ విషయమున సంశయించి జాగొనర్పకుడు. కచుని
రక్షించి నాకు మిత్రభిక్షపెట్టుడు. (మోకరించి) * (గీతము)

శుక్రు: అమ్మాయీ! లెమ్ము. నీ యభీష్టము నెరవేర్చెదను.

దైత్యుల మూర్ఖకృత్యంబులు వారి నెత్తిమీదికే వచ్చినవి. "వినాశకాలే విపరీతబుద్ధి" యనునట్లు వారు శిష్యుం జంప నెంచులకై నిశ్చయించిరో యదియే యిప్పుడు సిద్ధింపనున్నది. మీరు లోనికేగుండు. నేను కచునకు మంత్ర ముపదేశించి నీ కడకు పంపెదను.

దేవ: తండ్రీ! మీ ఋణంబు నేనెట్లు తీర్చుకొందునో? (నిర్మలతో నిష్క్రమించును.)

శుక్రు: బృహస్పతి పుత్రా! నీవు ధన్యుండవు, నా సుత నీపైం గరుణ బూని యున్నది. నేను నీకు మృతసంజీవనీ విద్య నేర్పెదను. ఏమనియెదవు?(విని)మా సంభాషణ వింటివా? అట్లు తప్పకయొనర్చెదవా? సరే. వినుము. నీవు కచరూపమునున్న యింద్రుడవు గాకున్న నే జెప్పు విద్య గ్రహింపుము. (ఏదో మంత్రము పఠించి) యిక బయటికి రమ్ము. (శుక్రుని కుక్షినుండి బయటికివచ్చును. పుష్పవర్షము గురియును. శుక్రుడు మృతినొందును.)

కచు: నేటికి ధన్యుండనైతిని. అసురులకారణమిత్రుండనై ప్రవర్తింప సుర కార్యంబు సాధింప శక్తుండనైతిని. ఇంక గురువర్యుం బ్రతికించి సెలవుగైకొని నిజగృహంబున కేగెద.

(మంత్రింప శుక్రుండు కన్నులం దెఱచి లేచి కూర్చుండ, కచుడు నమస్కరించును)

కచు:

ఉ॥ పంతముతోడ దానవులు పల్మరు నన్వధియించినన్ దయా
కాంతమనస్కులై తనువు గ్రమ్మర నన్ బ్రతికించి సత్కళా
వంతుని జేసి యాత్మజుని వైఖరి బ్రోచితిరయ్య మిమ్ము నే
నెంతని సంస్తుతింతు మరి యేమని స్తోత్ర మొనర్తు భార్గవా!

కించిద్జ్ఞుని నన్ను మృతసంజీవనీ దానముచేత విధాతృప్రతిమానుని జేసితిరి. ఇంక మీరే నాకు తల్లియుం దండ్రియు.

శుక్రు: కచా! విధివిధాన మట్లున్నది. నేను రాక్షసులం బిల్చి, వారి మూఢత్వముచేం జేకూరిన ప్రమాదము దెల్పెద. ఇక నీవు సుఖముగా నుండ వచ్చును. వారు నీజోలికి రాజాలరు.

కచు: గురువర్యా! నా ప్రార్థన మాలకింపవలయు.

శా: నన్నీ దైత్యులు చంపినందనుక నానందంబుతుం గాంచరిం
కన్నా ప్రార్థన మాలకించి నిజలోకంబేగి యందున్న నా
యన్నల్దమ్ములం వల్లిదండ్రులను సౌఖ్యంబారగా గాంచ వి
ద్యాన్నత్కప్రద! నాకు వేగ సెలవిమ్మా శిష్యరక్షార్థివై.

శుక్రు: కచా! నీవు పోవలయు నన్న నే నడ్డగించు వాడనా? పోయి రమ్ము. నీతండ్రికి మహర్షులకు నా వందనము లనుము. నే నొసంగిన విద్యను జక్కగా రక్షించు కొనుము.

కచు: దేవా! మీ యనుగ్రహ మాశీర్వాద మహత్వంబున నట్లే యొనర్చెద. ఇంక నాకై వేచియుండు దేవయాని కడకేగి సెలవు గైకొనియెద. నన్నాశీర్వదించి పంపుడు.

శుక్రు: కచా! పోయిరమ్ము. నిన్ను మహేశ్వరు డెల్లప్పుడు రక్షించుగాక. (కచుడు నమస్కరించి నిష్క్రమింప యవనిక పడును)

*

షష్ఠరంగము

స్థలకము— దేవయాని కుటీరము

(దేవయాని నిర్మలయు నాసీనలై యుందురు)

నిర్మ: నెచ్చెలీ! నీ మానసమందుండు మోహమును వెలిబుచ్చి కచుని నీ దాసునిగం జేసికొన నిదే సమయము.

దేవ: అక్కా! నా కట్లోనర్చుటకు సిగ్గుచే నోరాడకున్నదిసుమా!

నిర్మ: ఇట్టిసమయమున సిగ్గుపడి యూరకుంటివా, నీ గతి దుర్గతియే. అతఁడు బహుశ మృతసంజీవనీ విద్య నేర్చుకొనినంత నిజలోక మున కేగును. కావున నీ యెదనున వెతపుచ్చక నీ యభీష్టమును నెరవేర్చుకొమ్ము. పిదప పశ్చాత్తాపపడిన ప్రయోజనము లేదు.

దేవ: నిర్మలా? అత డీదినమే సురలోక ప్రయాణ సన్నాహ మొన ర్చునా?

నిర్మ: ఏమో? నా కట్లే తోఁచుచున్నది? అదుగో కచుఁడిటే వచ్చు చున్నాడు. ఆతని నడుగుము. నే నేగెదను నీవు లజ్జనదలి కార్య సాధనమునకు గడంగుము. (నిష్క్రమించును) * (గీతము)

కచు: (ప్రవేశించి) సోదరీ! నీ వొనర్చిన యుపకారంబు జన్మాంత రము వరకుండునటుల రొనర్చితివి. నీకతన నాకు ప్రాణంబులు, మృతసంజీవనీవిద్యయు లభించినవి.

దేవ: దానికేమిగాని, నిన్ను మరలఁ గన్నులపండువుగ గాంచి నీతో మనసార మాట్లాడ గలిగినందులకు నాకుఁ జెప్పరాని యానంద ముప్పతిల్లె.

కచు: ఇదంతయు నీ యనుగ్రహ ఫలముగదా. నుడివెద నొకమాట.

మ॥ తోడబుట్టువుకంటె నీ వొగి తోడునీడగఁ బ్రోవ నే
నీడులేని సుఖంబునందితి నింక నా తలిదండ్రులన్
జూడగాఁ దినమేగ వేడెద శుక్రుఁ డీకొనె నీవునున్
జేడెరో? సెలవిచ్చి దీవనఁ జేసిపంపు దయామతిన్.

దేవ: మిత్రా! మిత్రా! ఏమంటివి? గురునాజ్ఞమై నీవు స్వపురంబున కేగెదవా? ఏన్నేమి చేసెదవు. నీ వేగిన నాకింక నెవరు ఫలపుష్పా దులదెచ్చి సంతసముచేకూర్తురు? ఎవరు సేవలచే దన్పుదురు? ఎవరు గానన్నాట్యంబు లభినందింతురు. అక్కటా! నీ వేగిన నా కీ లోకమే పాడుగదా!

కచు: సోదరీ! దైన్యమొందకుము చిరకాలమింకుంటినిగదా? విద్యా పారంగతుడనైతిని. వ్రత నియమంబుల నిర్వర్తించితి. గురువర్యు నంగీకారము బడసితి. నీవును నామేలుగోరి పంపినఁ గృతార్థుడ నయ్యెద.

దేవ: అక్కటా! ఇంత త్వరితముగా బో నేల? ఇక నాల్గు దినములుండి పోఁగూడదా?

కచు: సోదరీ! నా జననీజనకుల గాంచ నా మనంబువ్విళ్లూరుచున్నది. మరియు నేనింక దానుసించిన నీ యసురాధములు మరల నాకే విధమున కీడొనర్తురో? అన్యథాదలంపక నాకు సెలవొసంగుము.

దేవ: అక్కటా! నేనెట్టులా మాటవాకుత్తు. కచా! నీవు వృత్తంబుచే జననముచే విద్యచే, తపముచే దమముచే ప్రకాశించుచు న్నావు. చిరకాలమునుండియు నా నెయ్యంబునకు బాత్రుండ వైతివి. అయినను నీవు నా హృదయంబెరుంగక మాటాడుచు న్నావు. ఇక నేమందును?

ఉ॥ నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేరును గన్యకన్ మహీ
దేవకులావతంస! రవితేజ! వివాహము నీకు నాకు మున్
భావజుశక్తి నెనయుది. వన్నుగ నన్నుఁ బరిగ్రహింపు, సం
జీవనిఁ గోడ శుక్రుదయ జేయము నాకుఁ బ్రియంబు నియ్యెడన్.

కచు: (చెవులుమూసికొని) హరిహరీ! ఎట్టివార్త వింటిని. ఇది కలయా? భ్రాంతియా? (దేవయానిం గాంచి) అక్కటా! నిక్కవమేనా? సోదరీ! ఇట్లు మాటలాడనగునా?

కం॥ గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము ధర్మలోక పథమిది, దీనిం
బరికింపుము యీ పలుకులు
తరుణీ! గురుపుత్రి! నీకు దగునే పలుకన్?

నీ తండ్రి నా కెట్లు పూజనీయుఁడో నీవును నట్లే పూజనీయురాలవు. శుక్రశిష్యుండనగు నాకు నీవు సోదరివిగాని వేరు గానేరవు. కావున యీ ప్రశంస వదలి సెలవిమ్ము.

దేవ: కచా! నీవెట్లు నాకు సోదరుడవు? నీవు నా గురుఁడగు నాంగిరసుని పౌత్రుండవు కాని నాతండ్రికి బుట్టినవాడవు గావు. కాన నీవు నాకు బూజనీయుడవు. లేనిపోని వావివరుసలఁ దెచ్చిపెట్టి నిన్ను నమ్మిన నీ దాసిని నన్ను విరహానలమున ద్రోయకుము. నాకంటే నీకు మంచి మను వెక్కడ దొరుకును?

కచు: సోదరీ! నీ విట్లాడిన నే నేమనగలను. నీవు గురుపుత్రి నగుట నాకుఁ వరణీయవు కావు. అదియునుంగాక, నే నెవరినో పరిణయ మాడనున్నట్లు దలంచుచుంటివేమొ. నేను నిత్యబ్రహ్మచర్యవ్రతము దాల్చినవాడను. నాకు బెండ్లియే లేదు.

మ॥ సరసీజేక్షణ! బ్రహ్మచారినయి యీ జన్మంబు కాలంబునుం
జరుపన్ నిశ్చయ మూనినట్టి జటితో సంసారముం జేయఁగా
వరియింపన్ ఫలమేమి? ఇంకయిన నవాంఛన్ విసర్జించి ప్రే
మగు నింకొక్కని గోరి సౌఖ్యపడుమమ్మా నీవు తారార్కమున్

దేవ: అక్కటా! కచా! ఎంతనిర్దయుఁడవై మాట్లాడుచుంటివి. * (గీతము) నాకు నీ తోడిదే లోకంబుగానుండ, నా సర్వేంద్రియములు నీ దర్శన స్పర్శన సల్లాపాది సుఖంబులనే కోరుచుండ నే బరుని గోరగలనా? కోరిన సుఖింపగలనా? (దగ్గరకు వచ్చి) నా మాట వినుము! ఎంతమంది గురుపుత్రికలఁ బెండ్లాడలేదు? ధర్మ మధర్మమని తలచి నీ దాసిపైఁ దయ దొలంగకుము. నేను నీ కొనర్చిన సాహాయ్యమును స్మరణకు దెచ్చుకొమ్ము.

సీ॥ ఛాత్రుగాగాని నాకు శాస్త్రంబులను నేర్పు
మంచు నా తండ్రిఁ బ్రార్థించు నాఁడు

వృషపర్వ ప్రేరణ విలయ రుద్రునిబోలె
నినుద్రోల నా తండ్రి జనెదునాఁడు
అలను గాచుచో నసురులు వధియించి
సాలంబునకుఁగట్టిఁ జనెడినాఁడు
క్రమ్మఱ నినుబట్టి ఖండ ఖండములుగా
జక్కాడి యంబోధి జల్లునాడు.
తే॥గీ॥ నిన్ను నే బ్రోచినంతనే నీవుచూపి
నట్టి యాకృతజ్ఞతభావ మకట! నేడు
మఱచినట్టుల చరియింప మాన్యముగునె
మార! సుకుమార! యో బృహస్పతి కుమార!

కచు: నీ వొనర్చిన మేలు నే మఱచువాడనుగాను. నియోజ్యమగు కార్యమొనరింపుమని నన్నడిగిన నే దప్పక సంతోషముగ నొనర్తును. అనియోజ్యకార్యాచరణము ఋషులకైనను ధర్మహానికరము. మన మిద్దరము శుక్రుకుక్షియం దుద్భవించితిమి. కావున మనము నిక్కువముగా సహజాతులము. ఇక నీవు మాట్లాడక నాకు సెల వొసంగుము.

దేవ: అక్కటా! ఎంత నుడివినను, ఎన్ని విధముల బ్రతిమాలినను, నీ మూర్ఖపు పట్టుదల వీడకున్నావుగదా! * (గీతము)

కచు: సోదరీ! తడవయ్యె. అదిగో! అరుణోదయమగుచున్నది. నే నేగవలయును. ఈ నిష్ఠురోక్తుల మాని మనము సంతోషముగ గడిపిన కాలంబును స్మరింపుచు కాలము గడుపుము. నా ప్రయాణము జయప్రదమగునట్లు దీవింపుము. నేనేగినంత నీ మనంబున ధర్మకార్యాసక్తత దలంపుము. నీ తండ్రిని నిత్యము నప్రమత్తవై సేవింపుము. ఇంక నే బోవచ్చునా?

దేవ: ఇంతమాత్రమున నే నిన్ను బోవనిత్తునా ప్రియా! నన్నును నీ వెంబడి గొంపొమ్ము. ఏల వృథాగా నన్ను బ్రయాసపెట్టెదవు? నే

దీనను. వ్యామోహితను. నీవు నన్ను విడిచిన ప్రాణములు త్యజించెద. * (గీతము)

కచు: సోదరీ! నేనెంత నుడివినను నీవు మోహాంధకారమగ్నవై ధర్మాధర్మ విచక్షణ విదూరవై వాని వరసలు గమనింపక వర్తిల్లుచున్నావు. ఇప్పుడు నీ కేమి నుడివినను ప్రయోజనము శూన్యము. కొంతకాలమునకు నీకే నీ చర్యయందలి గుణాగుణ విశేషము తెలియగలదు. ఇంక నే బోయెద. * (గీతము)

దేవ: ధూర్త శిరోమణీ! ఎంత ప్రార్థించినను నా ప్రేమ నిరాకరించి నన్ని విరహజలధియందుంచి యేగెదవా? నేను కోపగించితినా నిన్ను ధ్వంసమొనర్పగలను సుమా!

కచు: కానిమ్ము. కానున్నది కాక పోవునా. నీకు నా చర్య కోపప్రదమయిన నా గ్రహచారమును కొందునుగాని ధర్మేతరకార్యమున కంగీకరింపను. కాముకులకు యుక్తాయుక్త పరిజ్ఞానము శూన్యముగదా! ఇక నేబోయివచ్చెద. సెలవిమ్ము (పోబోవుచుండ)

దేవ:

మ॥ అవునా? నిక్కమ? నేను దీననై సంప్రార్థించుచో నానుడుల్
జెవులం బెట్టక దుర్భరంబగు విరాళిం గ్రూరతం ద్రోసి యే
గ విచారింపక బట్టుబట్టెదె? సరే! కానిమ్ము నీ కింకరై
తవ సంపాదిత విద్య వ్యర్థమగుఁ గాతన్ వీతరాగాత్మకా!

(జలమెత్తి వదలును)

కచు: గురుపుత్రీ! ఆర్షధర్మం బానర్చినందులకు నన్ను శపింతువా? ఇది ధర్మమా?

తే॥గీ॥ అఘమును సేయంగనోడి నీ ప్రార్థనంబు
ద్రోసిపుచ్చిన శపియింతె ధూర్తురాల!
ధర్మమే జయమను మాట తథ్యమేని
నాదు శిష్యులకా విద్య నాటుగాత!

నీవు ధర్మబుద్ధివిగాక కామాంధకారవై నన్ను గామించి శపించితివి. నిన్ను ఋషిపుత్రుండెవండును పాణిగ్రహణ మొనర్చుకొనకుండు గాత! (శపింప దేవయాని 'హా!' యని మూర్ఛిల్లును) అయ్యో దేవయాని మూర్ఛిల్లినది. ధర్మకార్యాచరణ మెంతకష్టము. అయిన నా కదియేగదా కర్తవ్యము. దేవాధి దేవా! పురాణపురుషా! నాపై మోహభ్రాంతి గుందు నా గురుపుత్రికి నాపైవలపును మఱచి సుఖనుండు నట్లొనర్పుము. అదిగో నిర్మల వచ్చుచున్నది. ఇంక నే నేగెద. (ముందునకురాగా తెరవాలును.)

ఉ॥ ఏనలనాండు నీకు పను పేర్తరంజేయంగ వచ్చువేళ నీ
మానసమందు నెంచిన విమానము నప్పుడె పంపువాండ సం
చానతి యిచ్చినట్లుగ, దయామతి నియ్యెడదానిసంపి యీ
దానవలోకము న్విడువ దారినిజూపుము దేవ వల్లభా!

(విమాన మరుదెంచును. కచుండు విమాన మధిరోహించి నాకంబున కేగును.) (యవనిక పడును)

*

# సప్తమరంగము

## స్థలకము–ఇంద్రసభ

(ఇంద్రుండాసీనుండైయుండ దిక్పాలురు ప్రవేశించి నమస్కరించి)

అగ్ని: సురేంద్రా! మమ్ము పిలువనంపిన కార్యమేమి?

ఇంద్రు: దిక్పాలులారా! కచుడు మృతసంజీవనీ విద్యనేర్చి మన పురంబునకు వచ్చుచున్నాడు. అతనికి స్వాగతమొసంగుటకు మిమ్ము బిలువనంపితి.

వాయు: దేవా! అట్లే యొనర్తుము. ఇంక మనకు దేవాసురయుద్ధం
బున జయము తప్పదు.

వరు: త్రిలోక సామ్రాజ్యముం గూడ మనకే హస్తగతమగు.

అగ్ని: నేటితో సంధిగూడ నంతమగుచున్నది. రేపే మరల యుద్ధమా
రంభించి విజయలక్ష్మిని వశము చేసికొందము.

(బృహస్పతి ప్రవేశింప నందరు నమస్కరించి, దీవింపబడి)

ఇంద్రు: గురువర్యా నేఁడు మీ సుతుఁడు సురకార్యంబును జయప్ర
దముగ సాధించి, యమరానంద మొనర్ప వచ్చుచున్నాడు.

బృహ: నేనెంతయు ధన్యుడను.

ఇంద్రు: మేముగూడ ధన్యులమైతిమి. (కచుఁడు ప్రవేశింప నమస్క
రించును)

కచు: దిక్పాలులారా! మీ స్వాగతమున కెంతయు సంతసించితి.
(తండ్రిని సమీపించి) తండ్రీ! మీ యాశీర్వచన ప్రభావంబున
సురకార్యమును సాధించుకొని వచ్చితి.

బృహ: కుమారా! నీవు సురులకొఱకై పడినకష్టంబులు స్వజాతిగౌర
వంబును నెలకొల్ప యత్నించు వారలకుగూడ మార్గదర్శకము
లగుఁ గాక. ఆ చంద్రార్కముగ సురులచేతను, మానవులచేతను
గరుడోరగాదులచేతను, సంస్తుతింప బడుగాక.

కం|| అనిమిషులకు మృతసంజీ
వని శుక్రుని గొల్చి తెచ్చి పాలించిన నీ
వనఘాత్మ! నాకు, దారకు
దనయుఁడవైయుంట దనువు ధన్యంబయ్యెన్.

ఇంద్రు: గురుపుత్రా! నీవు మాకొనర్చిన యుపకారంబు నింతింతని
సంస్తుతింప మాకుఁ దరమా? నీవు యీకార్యముచే నమరుల
యాజన్మాంత కృతజ్ఞతకుఁ బాత్రుడ వైతివి.

మ॥ దేవదానవ యుద్ధమందున దేవతల్ మరణించుచో
సేవలం గవిసూను హర్షితుఁ జేసి మాకయి దివ్యసం
జీవనిం గొని తెచ్చి యిచ్చి ప్రతిజ్ఞ నిల్పితివో మహా
దేవ పుంగవ! మీ ఋణంబెటు దీర్చువారము యింకపై?

కచ: దేవేంద్రా! ఆమాట మఱల నెత్తకుంటయే నా ఋణము దీర్చినట్లగు.

ఇంద్రు: భూసురోత్తమా! అది మాకు సాధ్యమా? నీ విప్పటినుండి యజ్ఞంబుల దేవతల కిడు హవిర్భాగంబులలో నొకటి చెందుఁగాక.

కచ: శచీపతీ! మీ యభీష్టమే నెరవేర్చుకొనుము. అయిన నొకమాట. దేవయాని నన్ను వివాహమాడుమని నిర్బంధించె. నే గురుపుత్రి యని తిరస్కరించిన నాకా మృతసంజీవనీ విద్య వ్యర్థమగునట్లు శపించె.

ఇంద్రు: (దిక్పాలురు) అయ్యో! ఎంత ఘోరము.

కచ: భయపడకుడు. ధర్మసంస్థాపనార్థంబు నే వలదంటిని గాన, నేను నేర్చిన విద్య నాకు ఫలింపకున్నను, నా శిష్యులకుఁ దప్పక ఫలించు. అపారానంద మొనఁగూర్చు.

భరత వాక్యము.

మ॥ మనవిద్వేషుల సన్నిధానమున సమ్యగ్విద్యలేవైన, నుం
డిన వెన్దీయక యెట్టి కష్టముల నేనిన్ సైచి మీరెల్ల దా
నిని సాధించి స్వజాతి జృంభణము నెంతే ప్రేమనుగావింపఁగా
వనజాతాక్షుఁడు మిమ్ము జేకొనుత మాభాస్వజ్జతారంబుగన్!

○ సంపూర్ణము ○